# చిత్కాళ

(గేయ కథా కావ్యం)



రచన
'కవిరత్న' నీలా జంగయ్య
హైదరాబాదు

ప్రచురణ
శ్రీ దేవీ పబ్లికేషన్స్
ఇంటి నెం. 2-1-527/7
నల్లకుంట, హైదరాబాద్-500044

# పీఠిక

—డా॥ జి. చెన్నకేశవరెడ్డి

నీలా జంగయ్యగారు సుప్రసిద్ధ కవులు. వీరు ఏభైకి పైగా కవితారచనలు, ఇతర గ్రంథాలు రచించి, తమ వయస్సుకు స్వర్ణోత్సవాన్ని, తమ కవితా జీవితానికి రజతోత్సవాన్ని జరుపుకున్న కవిరత్న. వారి గ్రంథాలకు ప్రముఖ కవులు, పండితులు, విమర్శకులు పీఠికలు రాసి, వారి కవితా కృషిని ఎంతగానో ప్రశంసించారు. అంతటి కవులైన కవిరత్న జంగయ్యగారు వయస్సులోను, కీర్తిలోను ఎంతో చిన్నవాడినైన నన్ను తమ కావ్యానికి 'పీఠిక' రాయమని కోరడం నాకెంతో ఆశ్చర్యం వేసింది. దానికి వారు చెప్పిన కారణం విని ఎంతో వినమ్రుడినై మౌనంగా ఔదల దాల్చాను వారి ఆదేశాన్ని. వారు రాసిన ఈ కావ్యం గేయకావ్యం. నేను 'ఆధునికాంధ్ర గేయ కవిత్వం' మీద పరిశోధన చేసినవాణ్ణి. వారు నేను చేసిన పరిశోధన పట్ల ఎంతో సంతృప్తిని వ్యక్తంచేసి, తమ గేయ కావ్యానికి పీఠిక రాయాలని కోరడంతో నేను చేసిన కృషిపట్ల మరికొంత సంతృప్తి కలిగింది, మరికొంత నమ్మకం పెరిగింది. 'విద్యానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అన్నారు కదా పెద్దలు!

నీలా జంగయ్యగారికీ నాకూ ఈ సాహిత్యానుబంధం మాత్రమే కాదు, రెండు దశాబ్దాలకుపైగా ఒకే సంస్థ (తెలుగు అకాడమి)లో సహోద్యోగులుగా ఉంటూ, ఎంతో స్నేహంతో, పరస్పర గౌరవాభిమానాలతో ఉంటున్న అనుబంధం మాది. ఈ అనుబంధానికి ఈ ఇరవయ్యేళ్ళలో ఏనాడూ కించిత్తు కూడా భంగం కలగలేదంటే అతిశయోక్తికాదు. ఈ రెండు అనుబంధాలు, వారి ఔదార్యపూర్వకమైన, ప్రేమ పూర్వకమైన ముచ్చట నన్నీ కావ్యానికి పీఠికాధి పతిని చేశాయనుకొంటున్నాను.

జంగయ్యగారి రచనల్లో 'చిత్కళ' మొట్టమొదటి గేయకావ్యం. వారిది వరకు పద్య ఛందస్సులో అనేక కావ్యాలు రాశారు. మాత్రాఛందస్సులో కూడా ఎన్నో గేయాలు, బుర్రకథలు రాశారు. అయితే కథను తీసుకొని గేయకావ్యంగా రాయడం ఇదే ప్రథమం. గేయకావ్య నిర్మాణం నారాయణరెడ్డిగారితోనే దాదాపు

ఆగిపోయింది గేయకావ్యాలేకాదు, గేయాలుకూడా ఇప్పుడెవరూ అంతగా రాయటం లేదు. గేయం పాటగా పరిణమించి విప్లవపాటల్లో ఎంతో ముందుకు వెళ్ళి విప్లవ చైతన్యాన్ని రగిలించడంలో తనకర్తవ్యాన్ని ఎంతో సమర్థంగా నిర్వహిస్తున్న దశలో, గేయరూపంలో కావ్యం రావడం గేయకవిత్వం మీద పరిశోధన చేసిన నాకెంతో ఆనందంగా ఉంది.

'చిత్కళ'లోని కథావస్తువు ఒకప్పటి ఉత్కళదేశంలోని కళింగాంధ్ర ప్రాంతమైన ముఖలింగ క్షేత్రానికి సంబంధించిన స్థలపురాణం. 'చిత్కళ' కథా నాయిక. ఆమె యోగదీపిక. ఆమె 'ముఖలింగం' ఆవిర్భావానికి కారకురాలైన కారణజన్మురాలు. ఎక్కడో శ్రీశైలంలో జంగమకులంలో పుట్టి, ఐహిక విషయాలపట్ల ఏ మాత్రం ఆసక్తిలేక, శివునిమీదే ధ్యానం నిలిపి కాశీవిశ్వనాథుని దర్శించాలనే కాంక్షతో ఒక్కతే ప్రయాణమై, మార్గమధ్యంలో తారసిల్లిన అనేక శివక్షేత్రాలను దర్శిస్తూ పద్మనాభగిరిని చేరి, అక్కడి గిరిజన నాయకుడైన చిత్రగాయకుడి ప్రేమను కాదనలేక, అతనితో దాంపత్య జీవితంలో చిక్కుకున్నా శివపూజలోనే మనసు లగ్నం చేసుకొని, చివరకు తానుమెట్టిన పద్మనాభ గిరి ప్రదేశాన్నే అపర 'కాశి'గా అవతరింపజేసిన అపార సౌందర్య తేజోరాశి చిత్కళ. ఇంతటి ఉదాత్త వస్తువును కావ్యంగా మలిచారు జంగయ్యగారు. కథ తనది కాకపోయినా, కథలో మార్పులు చేర్పులు మలపులవంటి పెంపుదలలు చేయకపోయినా, కథను ఉన్నదున్నట్లు సూటిగా చెప్పినా, ఆ కథను తన అనుభూతి చక్షువుతో, దర్శన దృక్పథంతో చెప్పిన రచనాపద్ధతి కవిది. అందుకే జంగయ్య గారే కావ్యావతారికలో 'నాదన్నదిసుమంత లేదు. కథలోన నున్నానంచు కనిపింతు నచ్చటచ్చటను శయ్యా పాకములను గేయాలాప ముననన్'' అని చెప్పుకున్నారు వినయంగా. కవి దృక్పథంలో 'కావ్యలక్ష్యము కలుష హరణము' కథా వస్తువు కూడా కలుష హరణానికి కారణభూతమైన వృక్షంనుంచి ముఖలింగంగా ఉద్భవించిన ముక్కంటి కథ. కథ పాతదైనా, కథనం సంప్రదాయ పద్ధతికి చెందినదైనా, కవి ఆధునికుడు కాబట్టి పరిసర వాతావరణ పారిశుద్ధ్యాన్ని కాపాడుకోవలసిన పవిత్ర బాధ్యత పౌరుడైన ప్రతి వాడి మీదా ఉన్న అవసరాన్ని గుర్తించి ఈ కావ్యం రాశారనిపిస్తుంది. నగరారణ్యంలోని నరమృగాల క్రూరత్వం పట్ల, వంచనాశిల్పం పట్ల, మత విద్వేషాలతో మారణహోమం సృష్టిస్తున్న పైశాచిక కృత్యాల పట్ల కవికెంతో అసహనం,

అసంతృప్తి ఉన్నాయి. అందుకే 'మనిషి మనిషి కనగ మురిసే' మాయగూడని మాటలాడుచు, మమత చాటే మంచి మనసున మనెడు మాధవ శబరుల" ఇతి వృత్తాన్ని, పురహరుని ఇతివృత్తాన్ని ఎన్నుకున్నారు. నీడనూ, సంపదనూ ఇవ్వడమేకాకుండా, వాతావరణ కాలుష్యాన్ని హరించి, పారిశుద్ధ్యాన్ని పరి రక్షించే పచ్చని చెట్టును విచక్షణా రహితంగా నరికివేసి తన మనుగడకే చేటును తెచ్చుకోవద్దని అన్యాపదేశంగా ఈ కావ్యంలో నాయకుడైన చిత్ర గాయ కుడి పాత్రద్వారా ఉపదేశించారు. వృక్షసంపదను, అరణ్యసంపదను కాపాడ వలసిన ఆటవిక నాయకుడైన చిత్ర గాయకుడు తన ఇద్దరి తరుణీమణుల తగ వును తప్పనిసరి పరిస్థితులలో తన చేతులతోనే నరకవలసిన దుస్థితినీ మనస్సంఘర్షణనూ చక్కగా చిత్రించారు.

"అత్యున్నతమై ద్విజాళి
కావాస మొసంగి మిగుల
పూలనీడలను నొసంగి
ఘనజీవమును సాధిం
చినదెన్నో వసంతాల
గని తానై బతికిన దా
నిని నేగతి తెగటార్తును
సవతుల పోరునగడ ఈ
చక్కని చెట్టును నరికే
వని చెడుకాదాయని మన
మున తపించును 'తప్పను' "

అందుకే చెట్లను విచక్షణారహితంగా నరికివేసి నగరాలను నిర్మించుకొని అనేక కాలుష్యాలకు ఆలవాలం చేశాడు నేటి నాగరికుడు. స్వచ్ఛమైన గాలికోసం, వంచనలేని మంచితనం కోసం ఆధునిక మానవుడి ఆర్తనాదం అరణ్యరోదన మైంది. అందుకే కావ్యావతారికలో జంగయ్యగారు-

నరుడు పాపమెరుగక నా
తరువును ధర కొరగ నరుక
వరశివుడా నరుకు చోట
వరలింగ ముఖాన వెలిగి
వనమును కాపాడెనన్న
ఘనమగు నీకథ నా మన
మునగల బాధను బాపగ
గేయకావ్యముగ దీర్చితి'

వనసంరక్షణ కవి ఆశయం. కావ్యలక్ష్యం కలుషహరణం. ఇలాంటి ఇతివృత్తమున్న కావ్యం ఆవశ్యకత ఈరోజుల్లో ఎంతో ఉంది.

కవికి గల అభ్యుదయ దృక్పథం, ఆశయం కావ్యావతారికలో-

''ఈగలు తేనెల నింపగ
ఎవడో తెట్టెను గొట్టును
ఎవడో మధువును గ్రోలును
సామాన్యుల శ్రమఫలమును
సాధించుకొనంగ జూచు
జార చోరచిత్తులు సువి
చారులు కారెందు జూడ''

అనే చరణాలలో చక్కగా ఆవిష్కృతమైంది.

ఈ కావ్యం రెండు స్కంధాలుగా సాగింది. కావ్యాంతర్గత భాగాలకు స్కంధమని పేరు పెట్టడంతో ఎంతో ఉపజ్ఞ ఉంది. కథావస్తువు మధూకవృక్షం నుంచి ఉద్భవించిన ముఖలింగుని చరితం. మధూకవృక్షం ఈ కథకు మూలం. చిత్రగాయకుడు తన ఇద్దరి భార్యలైన చిత్తికి, చిత్కళకు మధూకవృక్షం చెరి ఒక స్కంధాన్ని ఇచ్చి, ఆ స్కంధం నుంచి రాలిన పూలనమ్ముకొని జీవనం చేసుకోవలసిందిగా ఏర్పాటు చేస్తాడు. కాని చిత్తికిచ్చిన ఉత్తర శాఖ కంటె చిత్కళ కిచ్చిన దక్షిణ శాఖనుంచి రాలిన పూలకే ఎక్కువ ధర రావడంతో చిత్తి భర్తతో

తగవు పెట్టుకొంటుంది, తనకు దక్షిణ శాఖే ఇమ్మని. అతడలాగే ఏర్పాటు చేస్తాడు. అయినా చిత్కళకిచ్చిన ఉత్తర శాఖ నుంచి రాలిన పూలకు అధిక ధర రావడంతో అసలు చెట్టంతా తనదేనని, చిత్కళమాయావి అని, ఆమెను విడిచిపెట్టాలని భర్తతో తగవాడుతుంది చిత్తి. తన ఇద్దరిభార్యల తగవుకు కారణమైన మధూక వృక్షాన్ని నరికివేస్తే, ఆ మధూక వృక్షం నుంచి మధూకేశ్వరుడుద్భవించాడు. ఈ క్షేత్రమే ముఖలింగ క్షేత్రం. చిత్తి చిత్రగాత్రుల దాంపత్య జీవనాన్ని ప్రథమ స్కంధంలోను, చిత్కళవృత్తాంతాన్ని ద్వితీయ స్కంధంలోను చెప్పడం జరిగింది. చిత్తి చిత్రగాత్రుల శృంగారాన్ని ఎంతో విస్తృతంగా వర్ణించారు. కాని చిత్కళ చిత్రగాత్రుల శృంగారాన్ని ఏమాత్రం వర్ణించకపోవడం ఎంతో ఔచితీమంతంగా ఉంది. చిత్కళ శివభక్తురాలు. ఆమెకు ఐహిక విషయాలంటే గిట్టవు, అసలే పట్టవు. బంధువులెంతగానో ఆమె వివాహ విషయంలో ఆమెను అవహేళన చేసినా, వాళ్ళ మాటలను లక్ష్యపెట్టని శివదీక్షాపరురాలు. అందుకే అనివార్య కారణాల వల్ల చిత్రగాత్రుని అర్ధాంగి అయిన చిత్కళతో శృంగార రసాన్ని పోషించకపోవడం ఎంతో ఔచిత్యవంతంగా ఉంది.

కథ చిన్నదే అయినా, కథలో పాత్రలు మూడే అయినా, ఎన్నో వర్ణనలతో, విశేషాలతో వంద పుటల దాకా విస్తరించిందీ గేయ కావ్యం. 'పద్మనాభగిరి' శీర్షికలో పర్వత వర్ణన 'వన వసంతం'లో వన వర్ణన, 'సవర జీవనం', 'సవర చిత్తారి', 'వనలక్ష్మి జాతర' అనే శీర్షికలలో సవరల జీవన విధానాన్ని, వారు చేసుకునే వేడుకలను, ఉత్సవాలను ఎంతో రమ్యంగా, రమణీయంగా రచించారు. ఈ ఘట్టాలు ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యంలోని తిన్నని వృత్తాంతాన్ని తలపింపజేస్తాయి. 'అలంకారం' అనే శీర్షికలో ఎన్నో రకాల ఆభరణాల పేర్లను, వాటి పేర్లను తీరుతీరునా వర్ణించడం జరిగింది. సరులు, గవ్వ పేరులు, జుంకాలు, పోగులు, గంటీలు, కొనికిపోగులు, లోలకులు, పూల బుట్టాలు, పుడకలు, కుప్పెలు, పింపిణులు, నాగరములు, జడగంటలు, నెలవంక బిళ్ళలు, పుల్లగజ్జెలు, పూల చుక్కల జాటు, తాయెత్తులు, బిళ్ళ పేరులు, కంటెలు, తీగెలు, ముక్కు పుడకలు, నత్తులు, ఒడ్డాణాలు, ముంజేతి కడియాలు, కంకణాలు, కడియాలు, తోడాలు-ఇలా ఎన్నో ఆభరణాలకు సందర్భానుసారంగా పేర్కొంటూ వర్ణించారు. అట్లాగే శబరుల వాద్యవిశేషాలను కూడా వర్ణించడం జరిగింది. ఇది ఆయన లోకజ్ఞతకు నిదర్శనం.

జంగయ్యగారు ఈ కావ్యం వర్ణించిన వర్ణనలలో ఎంతో సహజత్వం ఉట్టిపడుతుంది. సవరల జీవితానికి అద్దం పట్టినట్లుగా ఎంతో సన్నిహితంగా, సహజరమ్యంగా చిత్రించడం జరిగింది. ఇటువంటి చోట్లే కవి కనిపిస్తాడు, కవి దర్శనం కనిపిస్తుంది.

జంగయ్యగారు ఈ కావ్యంలో ఉత్ప్రేక్షలు, అతిశయోక్తుల వంటి క్లిష్టమైన అలంకారాలను ఎక్కువగా వాడలేదు. సహజ సుందరమైన, సరళమైన ఉపమాలంకారాలే ఎక్కువగా వాడి గేయానికి వన్నె తెచ్చారు. ఉదాహరణకు-

"చిత్రగాత్రుని గాన ఝరిలో
చిత్తి తరగై తేలిసాగును
చిత్తి సౌందర్యాబ్ధిలోపల
చిత్రగాత్రుడు నావయై మను"

అందమైన యువతిని సౌందర్య రాశి అనడం పరిపాటి. "సౌందర్యరాశి ఆయిన చిత్తి సౌందర్యవారాశిలోపల చిత్రగాత్రుడు నావయై మను" అని అనడం మరింత శోభాయమానంగా భాసించింది ఉపమాలంకారం. అంతేకాదు - ఈ కావ్యంలో ఎంతో ఉదాత్త భావ సంపద, తత్వ దర్శనం అగుపిస్తాయి. ఎన్నో రుచిరమైన సూక్తుల నెన్నిటినో చెరిగి పోశారీకావ్యంలో. ఉదాహరణకు-

పూల రంగుల వెన్నొయైనను
పూజలో నొక్కటిగ మారును"

"తెట్టెలో తూట్లెన్ని యున్నను
తేనె తీపియు ఒక్కటై మను"

వంటివి ఎన్నయినా చూడవచ్చు.

జంగయ్యగారికి ప్రాచీన కావ్యాలతోను, కవితారీతులతోను ప్రగాఢమైన అధ్యయనం ఉంది. కనుక ఈ గేయ కావ్యంమీద ప్రబంధ కావ్యాల ప్రభావం, ముఖ్యంగా మనుచరిత్ర, వసుచరిత్రల ప్రభావం పడక తప్పలేదు. స్వారోచిష మను సంభవానికి మూలపురుషులైన వరూధినీ ప్రవరాఖ్యులైన చిత్కళ, చిత్ర

గాత్రుల వృత్తాంతాన్ని ఎంతో మధురంగా మనస్సుకు పట్టేలా మలిచారు. అందుకే సంభవ సాదృశ్యాన్ని పురస్కరించుకొని చిత్కళ, చిత్రగాత్రులను వరూథినీ ప్రవరాఖ్యులతో పోల్చారు. అయితే ఈ పోలిక రూపంలో మాత్రమే స్వభావములో కాదు. స్వభావంలో కొంతవరకు చిత్కళ ప్రవరునితోను; చిత్ర గాత్రుడు వరూథినితోను పోల్చుతారు - ఈ వైపరీత్యాన్ని చక్కగా పొసగించి ఈ కావ్యాన్ని వైవిధ్యవిలసితం చేశారు. తీర్థయాత్రాచణశీలుడైన ప్రవరాఖ్యుడు మిన్నులు వడ్డచోట తెన్నుగానక హిమవత్పర్వతంమీద తిరుగాడుతుంటే వరూథినిచూసి తన ప్రేమను వెల్లడిస్తుంది. తీర్థయాత్రలు చేస్తూ కాళికేగలేక కానలో చిక్కువడి, పద్మనాభగిరిమీద సంచరిస్తున్న చిత్కళను శబరరూపంలో ఉన్న గంధర్వపతి అయిన చిత్రగాత్రుడు చూసి తన ప్రేమను వెల్లడిస్తాడు. ప్రవరుడు సంసారి అయినా విరాగి. చిత్కళ కుమారి అయినా సంసారబంధాల పట్ల అనాసక్తురాలు. చిత్రగాత్రుడు అదివరకే వివాహితుడైనా 'చిత్కళ' సౌందర్యంపట్ల ఆకృష్టుడయ్యాడు. చిత్కళ వివాహ విషయంలో బంధువుల మాటలను లక్ష్యపెట్టకపోయినా చిత్రగాత్రుడి అభ్యర్థనను కాదనలేకపోతుంది. కారణం ముఖలింగోద్భవం ఆమె మూలంగా జరగవలసి ఉన్నది కాబట్టి, చిత్ర గాత్రుడితో దాంపత్య జీవనం సాగించవలసి వచ్చింది.

ఇతివృత్తరీతిలో మనుచరిత్ర అగుపించినట్లే రచనారీతిలో వసుచరిత్ర పద్యాల నడకలు స్ఫురిస్తాయి. ఉదాహరణకు-

1. ఇమ్ముగ వనానరుచి
రమ్ముగ తరుల్ మధుర
సమ్మెలొదవన్ ఫలభ
రమ్ములగుచున్ – తో...

2. సుందర మధూకతరు
లందు మధుధారలు ప
సందుగ రసప్రసవ
విందు లొనరించన్...

గేయాలను ఉదాహరించవచ్చు. జంగయ్యగారు పద్యం సదపల విరుపు తీసుకొనివచ్చి కొత్త మెరుపులు సంతరించి గేయాన్ని ఎంతో శ్రవణపేయం చేశారు.

ఈ కావ్యంలో విశేషించి సవరుల జీవనవిధానాన్ని ఎంతో సునిశితంగ పరిశీలించి చిత్రించారు. సవరుల దుస్తులను, గృహాలను, గృహాలంకరణను, గృహోపకరణాలను, వేట పనిముట్లను, వారి ఆట పాటలను, నృత్యాలను ఎంతో వివరంగా వర్ణనాత్మకం చేశారు. అయితే ఆటవికుల వేటపనిముట్లలో ముఖ్యమైన వడిసెల, గులేరును కూడా పేర్కొని వర్ణించివుంటే మరింత నిండుగా ఉండేవి.

జంగయ్యగారు గేయాన్ని అన్నిగతుల్లోనూ (త్రిశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర) నడిపారు. ఖండగతిని కథాకథనానికి, చతురశ్రమిశ్రగతులను వర్ణనలకు ఎక్కువగా ఉపయోగించుకొన్నారు. చతురశ్ర, మిశ్రగతుల్లో గేయాన్ని ఎంతో వేగంగా కొన్నిచోట్ల నడిపారు. ఖండగతిలో కొన్నిచోట్ల మాత్రలు తగ్గినా లయకు అడ్డు రాలేదు. వీరి కలంలో గేయం ఎంతో తాళలయాత్మకంగా నడిచింది. సన్నివేశాల కనుగుణంగా, సన్నివేశం మారినప్పుడల్లా చాలావరకు గతిని మార్చారు. ఇది ఆయన గేయనిర్మాణమార్మికతకు నికషోపలం. ఉదాహరణకు చిత్రగాత్రుడు 'చిత్కళ'తో చేసిన వివాహ ప్రస్తావన ఖండగతిలో సాగింది. ఆ తర్వాత చిత్కళ తన మనస్సులో వితర్కించుకున్న విషయం చతురశ్ర గతిలో (పుట 56) సాగింది. తర్వాత చిత్రగాత్రునికిచ్చిన సమాధానం తిరిగి ఖండగతిలో సాగింది. చిత్కళ తన గతి (కాశికివెళ్ళే గతి)ని మార్చుకొని, చిత్ర గాత్రుని కోరికమేరకు దాంపత్య జీవితగమనానికి ఒడబడుతుంది. అందుకే చిత్కళ సమాధానం ఖండగతిలో నడిచింది. ఇలా సూక్ష్మంగా పరిశీలించినప్పుడు ఎన్నో విశేషాంశాలు గోచరిస్తాయి ఈ కావ్యంలో. జంగయ్య గారు పద్య రచనలో సిద్ధహస్తుడు కాబట్టి గేయరచనలో కూడా యతులు, ప్రాసలు, ప్రాస యతులు చాలావరకు పాటించారు. అయితే సినారె వంటి గేయకవులు పాటించి నట్లుగా అంత్యప్రాసలు అసలు పాటించక పోవడం చెప్పుకోదగ్గ విశేషం. ఈ విధంగా జంగయ్య గారు గేయరచనలో తన ముద్రను నిలుపుకున్నారు.

కావ్య బీజంలో కుమారస్వామి తండ్రి దర్శనార్థం వచ్చినప్పుడు అక్కడ శివలీలను వర్ణించిన తీరు మనోహరంగా ఉన్నది. అందుకే ప్రస్తావనలో ఈ కావ్యం చదివేవారికి, వినేవారికి ఈ కావ్యంలోని చిత్ర సౌందర్యాలను దృశ్య శ్రవణమయం చేశారు. మొత్తం మీద 'చిత్కళ' గేయ కావ్యాన్ని 'హృత్కళ'గా హృద్యంగా, రసోత్కర్షంగా తీర్చిదిద్దారు.

జంగయ్యగారు శివభక్తుడు. అందుకే శివభక్తి పారమ్యమున్న కథను స్కాంద పురాణంనుంచి తీసుకొని గేయ కావ్యంగా మలిచారు. సమకాలిక సమస్యను ప్రతిబింబించే మరొక కథను తీసుకొని సమగ్ర ఆధునిక గేయ కావ్యాన్ని జంగయ్యగారు రచిస్తే మరింతగా సంతోషిస్తాను. ఆ సామర్థ్యమూ, రచనా వేగము జంగయ్యగారిలో పుష్కలంగా ఉన్నాయి. అలాంటి సంకల్ప మొకటి జంగయ్యగారిలో కలగాలని, నా కోరిక త్వరలోనే ఈడేరాలని ఆశిస్తున్నాను.

హైదరాబాదు
23-12-1990

జి. చెన్నకేశవరెడ్డి

# అంకితం

## శ్రీ మందడి కృష్ణారెడ్డిగారికి

విమల కనగల్లు మండల వినుత శీలు
రగు యశోదకాంతారెడ్ల కాత్మజుండు
మందడీ వంశ వార్ధి గుణేందు డనగ
వరలె నీ కృష్ణరెడ్డి శుభ్ర ప్రశస్తి

ప్రాచ్యభాషా పట్టభద్రుడై యాంధ్ర సా
హిత్య లక్షణము గ్రహించినాడు
గ్రంథకర్తలకు యోగ్యంబైన సన్మాన
సభలు పెక్కులొనర్చ జాలినాడు
సకల కళారంగ సంస్థలు వర్ధిల్ల
హెచ్చుగా ద్రవ్యమ్ము లిచ్చినాడు
సురతరువన కవి వరుల కృతుల్ ముద్ర
గూర్చ ధనములీయ గోరినాడు

ఆర్జనమొనర్చినట్టి ద్రవ్యంబు మంచి
పనుల నెరవేర్చగా వ్యయపడినవాడు
కఠిన చిత్తుల చిరునవ్వు కత్తితోడ
కోయనెంచు కృష్ణారెడ్డి గొప్పవాడు

నిత్యనూత్న మర్యాదల నిల్పుకొన్న
స్నేహమున బీమెన్‌శాస్త్రి చేయు సూచ
నమున రచియించి 'చిత్కళ' నామకృతిని
కృష్ణరెడ్డికే నంకితమిచ్చుకొంటి

అతడు రాజసమూర్తి యని కదా హరిహరా
ద్వైతబుద్ధిని గూర్చినట్టి కృతిని
అతడు గుణాఢ్యుడే యని కదా గణగుణ
నీయమౌ శివకథ గేయకృతిని
అతడు దయామతి యని కదా శృంగార
కరుణరసాకృతిన్ గ్రాలు కృతిని
అతడు మహాస్తికుండని కదా పౌరాణి
కస్థల చరిత సంకలిత కృతిని

గాన యోగ్యంబుగా దీర్చి కవులు మెచ్చ
సరసులౌ సజ్జనాళి మేలరసి మెచ్చ
మెచ్చి చిత్కళ కావ్యంబు నిచ్చితంకి
తముగ కృష్ణారెడ్డి వరుని తనివిదీర.

కరముగ సత్కళావిభవ గౌరవదీప్తులనంద సాహితీ
వరగుణ మూర్తులందనుపు భాగ్యము లబ్బిన రెడ్డివర్యులై
బరగితి వాంధ్రదేశమున భవ్యచరిత్ర గనంగ నీకు నీ
శ్వరుడు సదాయురున్నతుల చాలినయంత నొసంగ నెంచెదన్

# భూమిక

ప్రకృతి వికృతుల దాగుడుమూతలాటే మానవజీవితం. ఒకొక్కొక్కప్పుడు వికృతి బలీయ మవుతుంది ఎందుకంటే ప్రకృతి స్వభావాన్ని వికృతి పుణికి పుచ్చుకొన్నదవుట వలన వికృతికాబలం సిద్ధిస్తుంది. ముందువచ్చిన చెవులకన్నా వెనకవచ్చిన కొమ్ములకే వాడి కలుగుతుంది. వాడి ధాటికి తట్టుకోవడం సాధ్యం కానప్పుడు వాటికి కుప్పెలు వేయవలసి వస్తుంది. కుటుంబ నియంత్రణకు ఆపరేషన్ పద్ధతి అనుసరించాలి మరి. ఉత్తరోత్తర బలీయాలు గమనించాలి కదా! మూలవిగ్రహాలు ఊరేగవు. ఉత్సవ విగ్రహాలే వీధుల్లోకి వెళ్ళి జన సన్మానాలందుతాయి. అందుకు హర్షించవలె తప్ప చింతించరాదు. పదాల్లో కూడా ప్రకృతి వికృతులున్నాయి. మూలప్రకృతి వికృతులందే పరిభ్రమిస్తుంది. ఈ నా చిత్కళ గేయకథా కావ్యానికి మూలం - అంటే ఆధారం శ్రీ బి.ఎన్. శాస్త్రిగారు 1985లో ప్రకటించిన "ముఖలింగ దేవాలయ శాసనములు." దానికి మూలం స్కాంద పురాణాంతర్గత కథ మధూకేశ్వర ఉద్భవం ముఖ్యసంఘటనగా చెప్పాలి. మధూకేశ్వరునికి ముఖలింగం క్షేత్రమయింది. ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే కథే ఈ గేయకావ్యం.

క్రీ.శ. 13 వ శతాబ్దానికి పూర్వమే ముఖలింగ క్షేత్ర ప్రాంతం హరిహరాద్వైత సందేశాన్ని ప్రపంచానికి చాటింది. ఏతత్పరిసర ప్రాంతాలన్నీ 5 వ శతాబ్దానికి పూర్వమే హరిహరాద్వైత తత్వాన్ని ఈ క్షేత్రం చాటిచెప్పినట్లు చెప్పుకోవచ్చు.

పూర్వకళింగ గంగరాజుల ఏలుబడిలో ఈ ముఖలింగం వారి రాజధానిగా ఉన్నట్లు ఈ దేవాలయాంతర్గత శాసనాలు చాటుతున్నాయి. అంతేకాక ఇచట జైన బౌద్ధ ప్రబోధాలు ఆరామాలు ఏర్పడినట్లు కొన్ని శాసనాలు చాటుతున్నాయి.

శాసనాలలో తల్లిపేర్లనే తండ్రికి మారుగా ఉపయోగించడంవల్ల అప్పటి ప్రాంతం మాతృస్వామిక వ్యవస్థను కొనియాడుపడిగా భావించుకోవచ్చు.

పద్మనాభగిరి, గోవిందకానము, జయంతీక్షేత్రంగా ఈ ప్రాంతం అభివర్ణితమై ఉన్నది. విష్ణుసంబంధమైన విశిష్టాద్వైతాచారంతో ప్రచురమైన ఈ ముఖలింగ క్షేత్రం శైవసంబంధమైన అద్వైత ప్రభావంతో వన్నెకెక్కినది.

అపూర్వమైన, విశేషమైన కళారాధనలు శిల్పసౌందర్య శోభలు వెదజల్లే ఈ క్షేత్రం భారతదేశ కళాలక్ష్మికి మకుటాయమానంగా విరాజిల్లిననడం అతిశయోక్తి అనిపించదు.

పూర్వ కళింగ ప్రభువుల ఏలుబడిలో గంగ శకవర్షపుటాచారంతో బాటు విజయ రాజ్య సంవత్సరాలు, చైత్రాది మాసాలకు బదులుగా మేషవృషభ రాశి నామాలు (నెలలకుమారుగా) వాడుకొన్నట్లు దానశాసనా లుద్ఘోషిస్తున్నాయి. ఉత్తరాయణ మాస సంక్రమణల ననుసరించి రాశి మాసముల నెన్నుకొని కాల నిర్ణయం చేసుకొన్నట్లు తోస్తుంది. గంగ వంశరాజులందరూ శివభక్తులే (క్రీ.పూ. 522- క్రీ.శ. 1434 వరకు) సుమారు వెయ్యేండ్లు పాలించినట్లు చెప్పుకోవచ్చు. అంతేగాక శ్రీ బి.ఎన్. శాస్త్రిగారి ముఖలింగ శాసనాల్లో ఎన్నో ప్రామాణికమైన విషయాలు వెల్లడించారు. వారి పరిశోధన గ్రంథాలన్నీ శాసనస్థ ఆధారాలతో ప్రకటించినవే. సాహిత్య పరిశోధకులకు అద్దం పట్టిన కాల నిర్ణయాలు చారిత్రక విశేషాలేన్నో సహృదయ రసజ్ఞుల నలరిస్తున్నాయి. ఆ స్ఫూర్తితోనే చిత్కళ గేయ కావ్యాన్ని రూపొందించాను. హరి హరాద్వైత మతసామరస్య విశేష గుణ తత్వమీ కావ్యంలో బీజమై, వృక్షమై - ఉత్తర దక్షిణ శాఖలై విస్తరించి చిత్తి చిత్కళానంద సౌభాగ్యమై మధూకేశ్వర మాహాత్మ్యంగా అభివర్ణితమయింది. ఈ కృతిలో చిత్రగాత్రుడు నాయకుడు - శాపగ్రస్తుడైన గంధర్వపతి - మధూకేశ్వర దర్శన సౌభాగ్యంతో విముక్తుడయ్యాడు. చిత్తి చిత్కళలు నాయికలై పద్మనాభ గిరి మాధవ వన సీమల్ని శృంగార రసమయం చేశారు. చిత్రగాత్రుని గంధర్వ గాన రసధునిగా వంశధార పరవశించి పరువాలతో ప్రవహించింది. ముఖలింగ క్షేత్రాన్ని పునీత మొనర్చినది సవరజన సమధికానంద సంధాయినిగా సుందర శిల్ప సౌభాగ్య మహాదాలయాలతో విరాజిల్లినదీ క్షేత్రం.

పూర్వ కళింగ రాజ్యం పిఠాపురం మొదలుకొని శ్రీకాకుళ ప్రాంతం వరకు వ్యాపించింది. శ్రీకాకుళంనుంచి వరిస్సా దక్షిణ భూభాగాన్ని పాలించిన గంగరాజుల పాలన ఉత్తర కళింగంగా చెప్పారు.

350 - 440 వాసిష్ఠీ వంశ కళింగ పాలన. 440 - 485 మాఠవ వంశ కళింగ పాలన. 485 - 497 గంగవంశ పాలనగా ముఖలింగ క్షేత్రం గురించి చెప్పారు.

ఈ గేయ కావ్యాంతర్గతమైన కథ స్కాందపురాణంలోని ఉత్తరఖండంలో తొమ్మిదో అధ్యాయంగా జయంతీ క్షేత్ర మాహాత్మ్యంగా ముఖలింగ క్షేత్రంగా వర్ణితమై ఉన్నట్లు తెలిపారు.

వంశధారానదికి తూర్పుతీరాన ముఖలింగ క్షేత్రం ఉంది. ప్రతి సంవత్సరం మాఘ బహుళంలో వచ్చే శివరాత్రి పండగకు వేలాది భక్తులీ క్షేత్రంలో వెలసిన ముఖలింగేశ్వరుని దర్శించి అర్చించి తరిస్తారు.

ఈ క్షేత్రం కాశీ క్షేత్రానికి సమానమయింది. కాశిలో గంగ. ముఖలింగంలో వంశధార ప్రవహిస్తుంది. నాలుగు యుగాల్లో ఈ క్షేత్రం గోవింద కాననంగా మధూకేశ్వరంగా జయంతీ క్షేత్రంగా ముఖలింగ క్షేత్రంగా పిలవడం జరిగింది. ఇక్కడే కోటి లింగాల క్షేత్రం ఉంది. ప్రధాన లింగానికి ముఖం ఉండటంచేత ఈ క్షేత్రానికి ముఖలింగమనే పేరు ఏర్పడింది. ఈ క్షేత్ర పాలకుడు పద్మనాభుడు. పరమశివుడు మధూక వృక్షంనుంచి ఆవిర్భవించడంవల్ల మధూకేశ్వరుడయ్యాడు. ఈ క్షేత్రాన్ని మధూకేశ్వరంగా పిలుచుకొంటారు. శబరులు నివసించే గిరి గహన క్షేత్రాలు నాగరికుల మన్ననలకు పాత్రమైనవే. గుణగణ సంపన్నులను శబరులు గౌరవిస్తారు. వనసంపదను వారి జీవితానికి ఉపయోగించుకుంటారు. నగరాలను దోచుకోరు. డప్పు, కొమ్ము, స్వరతిత్తి వారి ప్రధాన వాద్యాలు. ఉండేల వడిసెల బాణం వంటివి వారి శత్రు పరిసరాల నెదుర్కొనే ముఖ్యమైన మొదటి ఆయుధాలు. ఈ కావ్యంలో సమరంలేదు కనకనే వాటిని చెప్పలేదు. ప్రాణులన్నిటికీ నిత్యావసరమైన జల, వాయు, ఆహార కాలుష్యాలు లేని అడవుల్లోనే మునులు నివసించారు. యోగాలు సాధించారు.

## బ్రహ్మ కోరిక :

బ్రహ్మ మహేంద్రగిరిపై తనకు పూజార్హత సిద్ధించాలని మాధవ వనం కాశితో సమానం కావాలని హరిహరులను గూర్చి నూరు సంవత్సరాలు తపస్సు చేయగా ఆ హరిహరులు బ్రహ్మకు సాక్షాత్కరించి కాలాంతరంలో తన కోరికలు నెరవేరగలవని అంతర్హితులయ్యారు. తన కోరికలు సిద్ధించుననే ఆనందంతో సత్యలోకం చేరాడు బ్రహ్మ.

## తుంబుర నారదుల యజ్ఞం :

నారాయణుని ప్రీత్యర్థం హిమపర్వత ప్రాంతంలోని మందాకినీ తీరంలో తుంబుర నారదులు యజ్ఞం చేయ నిశ్చయించారు. ఆ యజ్ఞానికి సిద్ధ, సాధ్య, విద్యాధర, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, హరిహరాదులతోబాటు సమస్త ఋషులు ఆహ్వానించబడినారు. యజ్ఞారంభమయింది. అమరుల గాన మాధుర్యానికి ఆ ప్రాంత శబర జనం పరవశులై సమ్మోహితులయ్యారు. శబరకాంతలను గంధర్వులు చూసి వ్యామోహంతో వారిని కూడటం గమనించిన వామదేవ మహర్షి గంధర్వులను శబర యోనులందు జన్మించుడని శపించాడు. గంధర్వులు తమ తప్పిదము నొప్పుకొని శాపము నుపసంహరించమని వేడుకొన్నారు. అప్పుడా ఋషి గంధర్వులతో నారాయణుని శరణు వేడమన్నాడు. నారాయణుని చెంతకు గంధర్వులు వెళ్ళారు, సంగతి తెలిపారు. బ్రాహ్మణ శాప మమోఘమగుటచేసి వారింపక నారాయణుడు వారిని శివుని చెంతకు పంపాడు. పరమ శివునిజేరి ప్రార్థించగా - వారిని కని **మాధవ వన మందున్న** శబర స్త్రీలలో జన్మించి కాలాంతరంలో తన దర్శనంతో ముక్తులవుతారని తెలిపి పంపించాడు.

## పద్మనాభగిరి :

పద్మనాభగిరి ప్రాంతంలో శబరులు నివసిస్తున్నారు. శివుడు పార్వతితో ప్రమధగణాలు ప్రస్తుతించగా ఆ గిరివనంలో ఒక మధూక వృక్షమూలాన నివసిస్తూ ఉన్నాడు.

వామదేవ మహర్షి శాపగ్రస్తులైన గంధర్వులు పద్మనాభగిరి ప్రాంత శబరుల్లో జన్మించి పూర్వజ్ఞానం కోల్పోయి శబర వృత్తి వేట మొదలైనవి నిర్వహిస్తూ మాంసాశనులై జీవిస్తున్నారు. కాలక్రమాన ఆ శబరుల్లో చిత్రగాయకు (చిత్రగాత్రు) డనువాడు వారికి నాయకుడయ్యాడు. శబరులు వేటాడి తెచ్చిన జంతువుల్ని నాయకునికి సమర్పిస్తూ ఉండేవారు. అతని గానమాధుర్యానికి మృతజంతువులు సైతం మరల ప్రాణములుపొంది లేచిపోవుచుండేవి. ఇది చూచిన శబరులు మిక్కిలి ఆనందిస్తూ నామసార్థకుడని ప్రస్తుతించేవారు.

గొప్ప రూపవంతుడు బలవంతుడు పరాక్రమవంతుడు అయిన చిత్రగాత్రుడు కులకాంత "చిత్తి"తో వివాహితుడై ఆనందంతో గానమొనరించుచూ ఆ గిరి భాగాన హాయిగా జీవించే కాలంలో ఒక రమ్యరూప కాంతాలలామ (జంగమురాలు) చిత్కళ అనే పేరుగలది, కాశీక్షేత్రమును దర్శించే లక్ష్యంతో శ్రీశైలంనుంచి బయలుదేరి ఆయా శివక్షేత్రాలను దర్శిస్తూ కాలినడకన దారి తప్పి పద్మనాభగిరి చేరుకొన్నది. ఆ కొండపై ఉన్న చిత్రగాత్రుని చూపుల్లో నిలిచిపోయింది. అతని పవిత్రమైన ప్రేమలో రెండోభార్యగా కామభోగాలు అనుభవిస్తూ సవతులమధ్య నిలచిన మధూకవృక్ష శాఖల్లో విరిసిన పూవుల అమ్మకాల్లో అతిశయించిన తగాదాల్లో మతిభ్రమించిన ఆవేశానికి చిత్రగాత్రుడు గురయి తన గొడ్డలితో తన భార్యల కలహానికి మూలమైన మధూకవృక్ష మూలాన్ని నరకగా ఆ మూలంనుంచి గొప్పకాంతితో ఆవిర్భవించిన లింగాన్ని చూసి మూర్ఛ నొందటం - ఆ ప్రాంత శబరులంతా అక్కడ గుమి కూడటం- పరమశివుడా వృక్షకోటరంనుంచి ముఖలింగ రూపుడై పార్వతీసమేతంగా దర్శనమిచ్చి వారిని శాపముక్తుల్ని చేయడంతో మధూకేశ్వరునిగా అక్కడే నిలిచి సమస్త ప్రజల పూజలందటం జరిగింది.

## ముఖలింగ దేవాలయం :

క్రీ. శ. 1950 వ సంవత్సరం జూలై నెలలో విశాఖనుండి విడదీసి శ్రీకాకుళం జిల్లాకు మార్చినారీ గ్రామాన్ని. శ్రీకాకుళానికి 45 కిలోమీటర్ల దూరంలో ఉన్నదీ ముఖలింగ గ్రామం.

ఈ దేవాలయంతో పాటు అనియంక భీమేశ్వరాలయం సోమేశ్వరాలయా లున్నవి. ఈ ముఖలింగం కళింగ సామ్రాజ్య రాజధానిగా విలసిల్లింది. ఈ నగర కటకమే నేటి ముఖలింగం.

పూర్వమీ గ్రామం పర్లాకిమిడి జమీందారీలో ఉన్నది. పూర్వవైభవం కోల్పోయి శిథిలావశేషాలతో కనిపించే ఈ గ్రామంలో ముఖలింగేశ్వరాలయంలో నిత్యపూజలు జరుగుతున్నవి.

ఈ గ్రామానికి పడమర, దక్షిణావాహినిగా వంశధార జీవనది ప్రవహిస్తుంది. ఈ నదికి పడమట తీరంలో వాడవలస గ్రామం ఉంది. ఇది ఓడల వలసగా భావింపబడుతుంది. ప్రాచీన కాలంలో కళింగ నావికులిక్కడినుండి తూర్పుసముద్రాన్ని చేరి, ఆ తరవాత ప్రాగ్దేశాలనబడే బర్మా, సయాం, కంబోడియా, సుమత్రా, జావా, సింహళం, బోర్నియో వంటి ద్వీపాలతో వ్యాపారం చేశారు. పూర్వం కళింగ గంగ వంశరాజుల యధీనంలో ఉండేది. ప్రతి సంవత్సరం శివరాత్రి జాగరణ వేడుకలీ ముఖలింగంలో జరుగుతాయి. కళింగాంధ్ర శిల్పసంపదకీ ఆలయం తార్కాణం. గంగరాజుల నాటి శిల్పకళా వైవిధ్యానికీ ఆలయం నికషోపలం. ఈ ఘటనల కాధారంగా ఈ గేయకథా కావ్యాన్ని నా శక్తిమేర విన్నవించుకున్నాను. కవిసోదరులకు పండితులకు, పాఠకులకు నా చెప్పిన తీరునచ్చితే జనవ్యాప్తి పొందితే ఇంక చెప్పేదేముంది కృషి ఫలించిందనుకొంటాను.

కావ్యాంతర్గత వర్ణనలు, ఉపమానోపమేయాలు వంటివన్నీ పాతవే కావచ్చు. అవి ఈ కథలో నా ఈ కావ్యశయ్యాపాకాల్లో కొత్తరుచుల్ని కూర్చాలన్న దృఢచిత్తంతో నా నేర్పు ఓర్పుకొలది ప్రయోగించాను.

పీఠికను సమకూర్చిన డా॥ జి. చెన్నకేశవరెడ్డి గారికి, అందంగా అచ్చు వేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ఈ గేయకథా కావ్యానికి అనుమతించి ఆదరించిన నా ప్రియమైన మిత్రరత్నము శాసన పరిశోధకులు సాంఘిక చరిత్ర నిర్మాతలైన శ్రీ బి. ఎన్. శాస్త్రిగారికి, డా॥ అంజటి నరసింహంకవి గారికి నా ప్రత్యేక ధన్యవాదా లర్పిస్తున్నాను. సారస్వత బంధుకోటికి ఈ కావ్యాన్ని విందుగా సమర్పిస్తున్నాను. సేవించిన వారి వదన కమలాల నుంచి మధుర వాక్సుధలు వర్షించాలని ఆశిస్తూ—

—రచయిత

# నిత్య పద్య కవి జంగయ్య

డాక్టర్ అంతటి నరసింహం
మెహిదీపట్నం

చిన్నట నాటగోలె కవి వీరులు దాశరథీ, సినారె, కా
శన్నలు, భీమనాదులు, కళా జగ జెట్టి మహాప్రపంచ సృ
ష్టిన్నుతి కెక్కినట్టి కవిశేఖర శ్రీశ్రియు, ప్రేరకుల్గ, ఆ
యన్నల రీతి కైతల శతాధికముల్ రచియింపవే సఖా!

నిరతము పద్యకావ్యముల నిట్టలు దోప రచించునట్టి వా
రరుదయినట్టి కాలము, అహంకృతిదప్ప నాకింత పాండితీ
స్ఫురణము లేని యట్టి కవి పూరుష గర్వ ప్రదర్శనాబలో
త్కరమగునట్టి కాలమున, తావక పాండితి మెచ్చదగ్గదో
వరకవి జంగయా! సరసపద్య కవీ, పదశిల్ప భారతీ!

ఎన్నదగినట్టి గ్రంథాల నెన్నియో లి
ఖించినానన్న గర్వమొకింతయైన
నీదుఛాయలకేని రానీనియట్టి
నమ్రుడా జంగయా కొమ్ము నతులు నుతులు

అంతటి నరసింహం

# కావ్యశోభ

—డా॥ గుమ్మా శంకరరావు

చిరకాలం ఒకే సంస్థలో పనిచేస్తున్న మిత్రులు, కవిరత్న బిరు
లు నీలా జంగయ్యగారు "చిత్కళ" గేయ కావ్యాన్ని రాసి
నిపించారు. నాకు వినిపించడం ఆయనకు సరదా. నా తలపం
ఆయన కింపులు చేకూరుస్తాయని వారే అంటూ ఉంటారు.
స గేయాన్ని గానంచేసే ఒడుపు ఉంది. దరువూ, లయా, ఆయన
ా ఉంటే ఆయన ఇష్టాన్నిబట్టి అవి సాగుతాయి. పదిమందినీ
ానే ఆయన గానం నన్ను అలరించింది.

వస్తుతః నాకు పద్యాల ఒడుపు తెలిసినంతగా గేయాల ఒడుపు
ు. అయినా కవిహృదయం తెలుసుకోగలనన్న కారణంచేత
ఈ రెండు ముక్కలూ రాయమని వారు కోరడంతో నేనీ పనికి
న్నాను.

శ్రీ జంగయ్య గారిలో పాండిత్యం, శాస్త్ర జ్ఞానంవల్ల కవిత పెల్లు
. వారిది సహజ కవిత్వం. కావ్య శాస్త్రాద్య వేక్షణవల్ల
మే కవిత్వం వస్తే దాని ప్రత్యేకత అంత గొప్పగా ఉండదు.
, వ్యుత్పత్తి, అభ్యాసాలు కవికి అవసరమేకాని శ్రీ జంగయ్యగారిలో
త్తి (కావ్యశాస్త్ర జ్ఞానంవల్ల వచ్చింది), అభ్యాసం (నిరంతర కృషి
గా వచ్చింది) లేవు. కేవలం ప్రతిభవల్ల మాత్రమే ఆయన
ు చెబుతారు. అనేక సందర్భాలలో ఆయన చెప్పినవి ఫలానా
ాళిదాసు కూడా ఇలాగే అన్నాడనో, మరో ప్రాచీన కవి కావ్యంలో
ే నేను గుర్తించి చెప్పినప్పుడు ఆయన తనకవి తెలియకుండానే

రాసినట్లు నా ముందు చెప్పడం జరిగింది. దానివల్ల ఆయన వినయ సౌశీల్యం వెల్లడయ్యేది.

ఇంక "చిత్కళ"లో ఎన్నో సొబగులు నిక్షిప్తమయ్యేయి. ఆయన వాటిని అందులో కూర్చారని నేనను. ఆయనకు తెలీకుండా అవి అందులో చోటు చేసుకుంటాయి. ఆయన ఒక సమాధి స్థితిలో నుంచి వాటిని చెబుతారు. అందుకే ఆ కావ్యశోభ దివ్య కాంతులు విరజిమ్ము తుంది. నవ్య సుగంధాలు ఎగజిమ్ముతుంది.

ప్రకృతిసిద్ధమయిన కవి కాబట్టి ప్రకృతి వర్ణనలను రమ్యాతి రమ్యంగా వర్ణించారు. (పుట 28 చూడండి) మొత్తం పుట అంతా రమ్యాతిరమ్యమే. కాని ఒండు, రెండు తావులు తాకకుండా ఉండలేం.

పలుకు చిలుకల ముద్దుకొలుకు పచ్చదనాల
కోకిలారవరమ్య కోమల గాత్రాల
..................................
చిత్ర గాత్రుని రాగ చింతనాలోకనము
మదమరాళమ్ముగతి మందాకినుల దేల
తుమ్మెదలు ఝుమ్మంచు తమ్మురలు మీటంగ
హరిణాలు చెంగనాలాడి తూగాడంగ
..................................
తరులతాగుల్మములు తలలూపు చుండంగ
ఘనరాగ శోభలా
వనమెల్ల నిండెన్.

కవులందరూ చిలుక పలుకులని వర్ణించడం పరిపాటే. అయితే జంగయ్యగారి ప్రత్యేకత ఏమిటి అంటారేమో! శబరజాతి నాయికా నాయకుల వర్ణనకు వన ప్రాంతంలోని వస్తుజాలాన్ని ఉపమానోపమే యాలకు ఎన్నుకొని కమనీయంగా వర్ణించారు.

# స్వీకారం

—మందడి కృష్ణారెడ్డి

సుధామయోక్తులతో కుసుమ పేశలంగా రచించిన 'చిత్కళ' గేయకావ్యాన్ని నన్నంకితం పుచ్చుకొమ్మని 'కవిరత్న' శ్రీ జంగన్న ఆప్యాయంగా పలికినప్పుడు "నేనేం కృష్ణదేవరాయల్నా?" అన్నాను. వెంటనే వారన్నారు-మిమ్మల్ని కన్నవారు మీకా పేరు పెట్టారు కదా అంటూ వెంటనే, నేను పెద్దన్నను కాదు-జంగన్ననే అనడం నాకెంతో సంతోషమయింది. మేమిద్దరం ఒకే జిల్లా నల్లగొండకు చెందిన వారం. వారితో వారి కావ్యాలతో పరిచయమున్న వాణ్ణే.

"సప్త సంతానములలో ప్రశస్తిగాంచి ఖలము గాకుండునది ధాత్రికృతియెగాన" గానయోగ్యమైన ఈ కృతిని స్వీకరించ తగినదన్నట్లు నవ్వుతూ మా ఎదుట ఉన్న శ్రీ బి.ఎన్. శాస్త్రిగారు నావైపు చూసినారు. నన్నేం చేయమంటారో చెప్పండన్నాను జంగన్నగారితో. 21 జనవరి 1991 సోమవారం శ్రీ పంచమీ సరస్వతిని కొలిచే రోజున జరిగే ఈ పుస్తకావిష్కరణ సభలో మీరుండాలి అన్నారు. అంతే-కానీయండన్నాను. ఈ రకంగా కవిగారు కృత్యంకిత గౌరవం నాకు కలిగించినందుకు నేను ఋణపడి ఉన్నాను. వారికి నా ప్రత్యేక వందనాలర్పిస్తూ ఈ 'చిత్కళ' కృతిని సగౌరవంగా స్వీకరిస్తున్నాను.

హైదరాబాదు
29-12-1990

# చిత్రా ౯లె

## ( ప్రథమ స్కంధము )

### పిలుపు

ఓ నవ వసంత సౌభాగ్యమా !
మదమధుపరవ సంవేద్యమా !

వినుము చిలుకపలుకు సొగసులను
కనుము కోకిల గాన మాధుర్యలను

మాధవ వన సుధా
మధురమోహన గీతికలను
చిగురు రాగాల మెచ్చిన మొగ్గ సిగ్గుతో
అలరు నాదాల గొల్చిన పూల సౌరుతో

గేయ కావ్యమును సం
గీత యశో రమ్యమూర్తివై
అతులితానంద గుణ మ
హా హృదయ ! ఋతునేతవై — ఈ నా
గుండె తంబుర నాదమూ !
గుండె తంబుర గానమూ ! !

*     *

# కలుష హరణము

ఎవడు కవియో
ఏది కవితయో
ఎరుగు వాడొక
డీశ్వరుండే !

మనకు తెలిసిన కవులు బహుమతు
లను విరళముగ గొనియు సన్మా
నమ్ము లంది జనమ్ములో నధి
కమ్ముగా పరిగణన కెక్కిన

వారె, వారల నీశ్వరుడు నే
తీరు నెరుగునొ - తెలుపజాలను

ఎరుగవే సాహిత్య సంస్థలు
ఎరుగవే ముద్రణా సంస్థలు
బహుమతుల నిచ్చే వ్యవస్థలు
బహుళమైన ప్రచార సంస్థలు.

ఏక వస్తు జమీ సమస్తము
కలిమి లేముల కాద్యనంతము

సృష్టికర్తకు మూలమైన మ
హేశ్వరత్వ మనాది - సత్యము.

అదియె రూపా రూపములలో
అఖిల ఘటనా ఘటనములతో
అవని జీవా జీవములలో
కష్ట సుఖములుగా విశేషా
ద్వైతమై ద్వంద్వ ప్రవృత్తుల

వెలుగు నీడల కలిమిలేముల
చెలగు సుఖ దుఃఖాల తీరున
ఒకటి రెండయి - సకల మొకటై
సాగు విశ్వ విశాల తత్త్వము.

భావమయి శబ్దమున నిండెను
కరుణమై దుఃఖాంతమయ్యెను
బ్రతుకు శృంగార ప్రదమ్మై
కృతులలో సంస్తుతుల నిండెను.

కరుణ లేక జగాన సుకవిత
మనుటసాధ్యము మనిషి కరుణా
మయుడు గాక సమస్త బోధలు
మాననీయమ్మై చెలంగవు.

దయా ధర్మ కథా ప్రధానము
లైన కవితల కాత్మ కరుణము
కరుణ రస సంస్మరణ మోక్షము
కావ్య లక్ష్యము కలుషహరణము.

* *

# బీ జ ము

ఆనందమున బ్రహ్మ
అఖిల చరాచర
జీవకోటిని సృష్టి
గావించి విడువగా

*

ఆ విష్ణువెంతో ద
యా సాగరుండై స
దా వృద్ధిచేసి ము
దావహము నొందెన్

*

ఈశ్వరుడు కాలుడై
ఈ జగత్సర్వమును
హరియించి తాండవ
మ్మాడె నానందాన.

*

అతని జటాభ్రాల నాడి పాడెను దివ్య
గంగా తరంగాలు కదలాడె శశిరేఖ

సర్వ కళానంద సదనమై నిలిచె భువి
భువన మోహనమూర్తి ముక్కంటి దొరగాగ

పార్వతి లాస్యాన పరవశించ నతండు
అభవుడాతడు గాన నంటదుమృత్యువు

నిప్పుకంటినిజూచి తప్పుకొని తిరుగాడు
గొప్పలందున చాల గొప్పయన వాడనుచు

భూత జాతాదు లెప్పుడు చెప్పుకొనుచుండు
సర్వ మంగళుడు శ్మశానవాసుడట్టంచు

వాని లీలలు తేటపడవు లోకాననుచు
ప్రస్తుతించే వేళ పరమేశ్వరుని కడకు

ఆరు మోములవాడు ఆ నెమ్మి నెక్కిరా
మెడయందుగల పాము వడి బుస్సుమన్నంత

కంటి నిప్పున లేచె కడు గొప్పనౌ మంట
ఆ మంట చిరుసెగకు నబ్బుబ్బయని లేత

నెలవంక కరిగి చుక్కల బొట్లు రాల్చగా
మెడన పుర్రెల దండ మిరుమిట్లు గొల్పగా

ప్రాణానిలము లంది ప్రభు శంకరా! ఓం
నమః శివాయ ఓం నమః శివాయ మం

త్రోచ్చారణము సల్ప నుద్వేగ భావులై
భక్త బృందము శివ భజన చేసిరి కర

తాళ మృదంగవాద్య ధ్వను లెసంగన్
పంచ భూతములు విశ్వంభరుని యానంద

లీల నీగతిగాంచ జాలిగా నర్ధాంగి
పార్వతి వోరగా పరమేశ్వరుని గాంచె

దరహాస చంద్రికలు వర పద్మనయనాల
నాలికించు నా లీల పరికించె నీ కావ్య

గతిలయలు సౌందర్యలతలగుచు గేయాల
కొనసాగి రాగాల కుసుమించి పలికెడా
నందాల లోక కల్యాణమ్మొనర్పన్.

*    *    *

ఘను లెన్నో వర్షాలుగ
వనమును జీవన దాన
మ్మున పెంచిన ఫలమూన భూ
మిని మనుజీవుల నాదర
మున దరిజేరగనిచ్చుచు
పూలు పండ్లు నీడ లొసగి
జాలిదెండమున నిల్చుచు
కాననమున కడువసంత
గానమ్ములు వరలు లతా

జాలమ్ముల మధు మకరం
దాల నిచ్చు భూజమ్ములు
తని పేరస హృదయము గల
చిలుకలు కోయిలలు కూడి
పలుకులు పాటలు పాడగ
నరుడు పాప మెరుగక నా
తరువును ధర కొరగ నరక
పర శివుడా నరుకు చోట
వరలింగ ముఖాన వెలిగి
వనమును కాపాడెనన్న
ఘనమగు నీ కథ నా మన
మునగల బాధను బాపగ
గేయ కావ్యముగ దీర్చితి
తీయని రాగముల నింపి.

ఈగలు తేనెల నింపగ
ఎవడో తెట్టెను గొట్టును
ఎవడో మధువును గ్రోలును

సామాన్యుల శ్రమ ఫలమును
సాధించు కొనంగ జూచు
జార చోర చిత్తులు సువి
చారులు కా రెందు జూడ

పరధన కాంతాసక్తులు
స్వంతముగ నలేరుదేని

కట్టుకొన్న గూడు తా
కట్టున పరవశమైతే
ఆ బాధాగ్నిని రగుల్చు
గా లింగని తిడుదున -
ఆ ముఖలింగని గొలుతున
ముఖలింగని దలచితాప
ము క్కిగోరి నుతించితిని
ఫలాఫలము కర్మనెంచి
కలిగించు నటన్న నమ్మ
కమ్మె గేయ కావ్యమ్మె
గ్రాలె కళా లోకమ్మున.

పూలలోని పరిమళాల
మధువులోని మాధుర్యం
తుమ్మెదలు గ్రహించు విధమ
దెమ్మెయి నొరు లరయగలరు !

మధూకమున నుదయించిన
మాహేశ్వరుడే యెరుంగు
ముఖలింగ స్థల మహత్వ
మును నుతింప, నా తరమా?

రచనలోని రసరమ్య
ప్రభలు సరసు లెరుగునట్లు
అరసిక జనమెట్లు దెలిసి
యనుభవించ జాలుదురా?

మగువ యధర పల్లవమును
తెగువ కోర కిత మొనర్ప
మనసిజుడే ముద్దిడు మొర
టునకది సాధ్యంబగునా?

గేయమ్మున గల రాగ
చ్ఛాయ దెలిసి పాడలేని
కంఠము కంఠమ గుడిలో
ఘంటిక లయగతి గనునా?

గాయపడిన కవి గుండియ
గేయ లయల వినుతించును
కోయిల యిది యని దెలియుట
గేయమర్మ మెరిగి కదా!

కాకులు కోకొల్లలుగా
లోకమ్మునగల వెన్నో
అరవకని విదల్చరు సం
బరపడి దరిజేర్చ రెవరు.

మనుషులందు కవి వేరై
మనుటది సహజము కా
కులలో కోకిల వేరై
కూయు కాల మెరిగి కదా!

కవికి కూడ కాలమింత
కలిసి రాకపోయినవే
శల మౌనము దాల్చిన యద
వులలో కోయిల విధమ్ము.

బహుమతు లందకయున్నా
పాడక విడువదు కోకిల
కవి కాయమునే గేయము
గాగ దీర్చు కావ్యమ్మును.

కాలమింత సహకరించ
గా నా కూజితములతో
వికృత జగతినే ప్రకృతిగ
వినుతు లందజేయగలను.

*          *          *

# ప్రస్తావన

చూపు తోవన సాగిన సోయగ చిత్రమ్ము
శ్రవణాభి త్తికన విరామ సౌందర్యమ్ము

హృదయాన రసరమ్య సేదనమై హంసలా
కదలియాడే చిత్రగాయకుని యద్వైత

భావపూర్ణంబైన ప్రవిమల రాగాలు
చిత్తి చిత్కళల విశిష్ట సౌందర్యాలు

పద్మనాభాంక పర్వత శిఖరాగ్రాల
వెలిగే యఖండ జ్యోత్స్నల నిండి దండిగా

ప్రబలిన మాధవ తపో వైభవాలలో
మోహన రూపమై ముఖలింగతేజమై

ఒప్పిన కథ ఋషులు చెప్పిన యద్వైత
మార్గోపదేశ మిమ్మహికి మోక్షమ్మని

గేయకావ్యముగనే వ్రాయబూనితి దైవ
మెవరితో నను గూర్చి యేమనిపించునో

వంశధారకు విన్నపము జేతు రాగాల
పలుకు తేనెల గేయముల దీర్తు కవినై.

* * *

గతకీర్తి కొంత ప్రస్తుతి జేతు పూర్వ శౌ
ర్యోదంత వీరమర్యాదలకు పాత్రమై

ప్రబలిన కళింగ సామ్రాజ్యమ్మునకు రాజ
ధాని, కళా సందలకునికి, ముఖలింగ

క్షేత్రమ్ము గాంగ వంశీయ రాజుల దీర్ఘ
కాలపాలన మందు గణుతికెక్కిన శిల్ప

కళ దేవళములందు కనువిందు చేయునీ,
ముఖలింగ భూమి సమ్మోహనమ్మై లోక
విఖ్యాతి పొందె నుద్వేల ప్రదీప్తిన్,
ఉత్తర దక్షిణాలొత్తి ఏకంబైన
హరిహరాద్వైత మహత్వంబు గలదై.

* *

చెక్కిన శిల్పాలు - చెప్పును కథలెన్నొ
రాళ్ళపైగల యక్షరాలు సాక్ష్యాలుగా

గతకాల జీవన గతులనే ఎరిగించు
కదలక మెదలక కటు శిలమ్ముల నిల్చి

వర్తమానాగత వైభవోన్నతికి తలి
దండ్రులై వారి తలిదండ్రుడు లట్టి శిల్ప



ముఖలింగము– మధుకేశ్వరాలయము



ముఖ లింగము – ముఖ ద్వార శిల్పము



సీతారామ లక్ష్మణులు - ఆంజనేయ స్వామి -
వాసుదేవాలయము

సంపద పూర్వాంధ్ర సంస్కృతిని విజ్ఞాన
ప్రగతి కేర్పరచు సోపాన పంక్తింజాటు

శాసనమ్ములు శిల్ప సంపదను వీక్షించు
నాటి రాజుల పాలనము లెట్టు లుండెనో

మనిషి మామూలు జీవన మెట్టులుండెనో
నేటి మానవుని కానాటి మానవుని సం

పద వారసత్వమై వరలుచున్నది కదా!
గత జీవన స్మృతులు కమ్మని వైనప్పు

గత మందుగల మంచి ఘనమైన దైనప్పు
వర్తమానమున కది పనికి వచ్చేటప్డు

తండ్రిగూర్చిన ఆస్తి తనయునకు దక్కగః
గతకీర్తి మానవోన్నతికి నాధారమౌ

కథలెల్ల చక్కని కావ్యములై సాగు
చదువు వారలకవి సౌరభమ్ముల గూర్చు

ఆ త్రోవసాగినదై "చిత్కళా వైభ
వము" గేయకావ్యమై వరలె నాంధ్రమున.

# ప్రవేశము

శ్రీషడానన్సుడు సు
శ్రీకరోత్కుల నగ
స్త్యున కెరింగించిన
ఘనమైన కథను నే
గేయ కావ్యముగ వా
గ్గేయ మూర్తులు మెచ్చ
కమ్మని లయగతుల
కవులు పొగడం గూర్తు
*  *  *

రసభావములు నక్షరాల శబ్దార్థభ
యాలంకృతుల విషయాల పుష్టిన్ దేల్చ

నాదన్న దిసుమంతలేదు కథలోన ను
న్నానంచు కనిపింత్తు నచ్చటచ్చటను శ

య్యా పాకములను గేయాలాపనమునన్.
కవులు వేలకు వేలు గలరందు కొందరై

నను చూడకుండ బోరని యెంచి వర్ణనా
త్మకము చేసితి తత్త్వదర్శనార్థమునన్.

*  *  *

వంశధారానదీ
ప్రవిమల మహోత్తుంగ
జలతరంగానంద
కలితనాదాలలో

మోహవశమై ముద్దు మురిపాల నలరు నా
ముఖలింగవాసికా వాసమైన మధూక

వృక్షశోభలు జగద్రక్ష గూర్చుంగాక
ప్రబల గురులఘ్వక్షరాలు గేయాలన్!

* *

ముని శాపతప్తుడై
వనచరుండైన - ఆ
గంధర్వరాజుకథ గానవేద్యంబై

భక్తజన హృత్పద్మ భ్రమరగీతానంద
రాగసుధలై పొంగు ప్రవిమలాద్వైత భా

వాత్మకంబై సాగు భవ్యకథకాధిపతి.
శబర జాతి విరాజ చంద్రుడోయనగ

చిత్తినాధునిగతా చెన్నొందినాడు
చిత్రగాత్రుని పేర చిత్కళను ప్రేమించి
వనచరుడు గంధర్వపతిగ రాణించె.

* * *

కథలు సంఘటనల గలుగు నెన్నెన్నో
అవి ముక్తిదాయకమై బ్రతుకుచుండు

ఆలులిద్దరు గలిగినట్టి దొంటయెకాదు
కథ భక్తి ముక్తి సంఘటితమ్ముగాన

కరుణ శృంగారరస భరితమ్ముకాగ
అలరింతు గేయ కావ్యముగనే దీని.

* * *

కావ్య తత్త్వమే ఒక శృం
గార రసోదధి తరంగ
డోలాయిత మాలికలై
చాలిన భాగాల సాగు.

ఒకే వస్తువున షడ్రుచు
లుద్భవించు గతి కృతిలో
నవ రసాలు కథా సుధా
ర్ణవమున నుదయింతు గదా!

జ్ఞానమందు విషయము లే
కంబై నడయాడుచుండు
భుక్తి ముక్తులందు స
మ్మోదము గావించుచుండు.

తెలి వెంతటిదైన జ్ఞాన
జలధి నుండి పుట్టినదే
ఫల మదెట్టిదైన వృక్ష
భాగమున జనించినదే.

చెప్పనెంత యనిగాకను
చెప్పిన దేమని మదిగను
ఏ బాసన చెప్పిన సరె
ఎట్లు చెప్పె నన్నదెగను.

గేయకావ్యమందు మంచి
కీర్తనీయమైన కథా
చరితము సామాన్యుడైన
చదివి తరించుటకె గాని
విత్తార్జన చేయకాదు
విబుధుల మెప్పొందకాదు.

మంచి భావములు పలువురు
పంచుకొనుట మంచిదన్న
ఊహకు పరమావధిగా
నుద్భవించె నీ కావ్యము.

గ్రంథము వ్రాయకపోయిన
కవి కవిగా బ్రతుకగలడు
గ్రంథము వ్రాసినగాని
కవిగా బ్రతుకుటసాధ్యము.

అస్లీ నక్లీలు జనము
లందు విభాగించి చూడు
కావ్యమేదొ చదివిచెప్పు
కవిని దెలిసి పొగడనేర్వు.

గ్రంథకర్తలై రెందరో
కవులు,గాక నేడు చూడు
కవిని బతుకనీని దుష్ట
కాలమునిక చెండాడుము.

*　　　*　　　*

భావము దెలుపుటకె కలిగె భాషలనంతముగా
నాదములందే పుట్టెను మోదములధికముగా

రాగలయల గానములో ప్రబలెగతులనంతముగా
ధ్వని ఊహను దెలుపు నర్థవత్ప్రదమై బరగ చిందు

నృత్యనాట్యముల సాగగ సత్యము ప్రకృత్యాత్మకమై
అక్షర, సంఖ్యలకు గలిగినట్టి గుర్తులొకతీరై

అవసరాలనే కొలుచుట లాయె తెలివితేటలు
భాషల భేదముజూపి ప్రాంతాలను చేయకు
ప్రాంతాలకు పేరువెట్టి రాగాలను తీయకు.

సాదృశ్యం సౌందర్యం
శ్రావ్యం నాదం హృదయా
నందం భావం కవితా
క్షేత్రంలో తత్త్వము ని
క్షిప్తము గుణగణ శోభిత
మానందం రసభరితం.

నేత్రం గుర్తించె చిత్ర
మాత్ర పవిత్రతల నెల్ల
కదలికలను తేజములను
స్వప్న భావ రూపములను
చర్మము గమనించె నుడుకు
చలి మెత్తని కరకులాది

గమనించెను ముకుపుటాలు
గంధాదుల మంచి చెడుల
నోట నాలు కెల్లరుచుల
వాటము గుర్తించ చెవులు
శబ్దనాద భేదాలను
సరస విరస భావాలను.

జ్ఞానావయములు దెలిపే జ్ఞానాంశములవి సమస్త
భేదాలను బాపుటకే వాదాలను మలుపుటకే.

సర్వ భ్రాంతులను దుడిచే సత్యముః జగదాధారము
మూర్తిత్రయములకు మూలమూర్తి నిరాకారమగుట

వెలుగు చీకటుల కాపై కలిగిన తత్త్వము దెలియుట
కేకథలుః జనించె కవిత కాకథ లాధారమయ్యె

అవి కవుల స్తుతి గేయములై వర్ణితమయ్యె భాష
లందు లయల గూడి రాగరతుల గతుల లఘు - గురు వా

క్షరములతో రీతులతో సరిగమ పదనీ, సప్త
స్వరతాళద్రుతి దీప్తుల శయ్యాపాకమ్ములతో

పాడిన పాటలు గాగను ఆడిన ఆటలు గాగను
అలరే కావ్యము సందేశాత్మకంబు కాగ మోక్ష

దాయకమౌ జీవుల కాద్యంతం బానందంబౌ
కవిత నిండు పదములెల్ల నవ జీవన చైతన్య

ప్రబల జిల్కు సుధామధుర రాగరంజితములై
కథ కక్కరకొచ్చే పదవితతి వేరు, గానములో

కవితలోన రసపట్టుల కదలే శబ్దములు వేరు
వర్ణనమున కనువైన సువర్ణములే వేరు వేరు.

పదము లక్షరాల గూడి ప్రయోగమున నర్థాఖ్యల
లక్షణాల నంటి గూర్చు లక్ష్యమ్ముల సాగుచుండు

కవి ప్రతిభను జాటు రమ్య కవితా సౌరభ శోభలు
మల్లెల మూటల విప్పిన నుల్లము లలరించు విధము
కవితా మర్మజ్ఞతలో కలదు జగత్కల్యాణము.

*          *          *



సోమేశ్వరాలయ దక్షిణ భాగము - కుమార స్వామి, హరిహరమూర్తి, అర్ధనారీశ్వరుడు



అనియంక భీమేశ్వరుడు



మధుకేశ్వరుడు



సోమేశ్వరాలయము ఉత్తరపు గోడ గూటిలోని ఏకపాదమూర్తి



సోమేశ్వరాలయ ద్వారములపై చెక్కబడియున్న శృంగార శిల్పము

# కథారంభం

శ్రీహరిని శంకరుని చిత్తంబులో నిల్పి
శతవర్షములు తపము సల్పె లోకాన నా
బ్రహ్మ తనకుంగూడ ప్రజలు పూజలు సల్ప
గుడికట్టి తన రూపు గొలుచు కోర్కెంగూడి
మాహేంద్రగిరి లోకమాన్యమై కాశితో
సమముగా ధరణి ప్రశస్తి నందగ నెంచి
తన మనోభీష్టములు ధర్మయుక్తంబె యని
హరిహరులు ప్రత్యక్షమై పల్కిరిట్లు - ఓ
బ్రహ్మ! నీ కోర్కె కాలమ్ములో సఫలమౌ
చాలించి తపమింక సత్యలోకము చేరు
మని చెప్పగానట్ల చనె బ్రహ్మ - అంతలో

* * *

నారాయణు ప్రీత్యర్థము తుంబుర
నారదు లొక యజ్ఞము సల్పగ నెం
చిరి హిమపర్వత ప్రాంతమ్మున నా
వర మందాకిని తీరము లోనన్.

* * *

వామదేవమహర్షి నేతృత్వాన యజ్ఞారంభమయ్యెను.
యక్ష, కిన్నర, సిద్ధ, గంధర్వాది దేవగణాలు మునిజన
నివహ మాహ్వానితులుగా నా సవనమును దర్శించవచ్చిరి.

సామగాన వినోదములు సు
స్వరముతో యజ్ఞస్థలము మా
ర్మోగ్రగ పరిసర శబర కాంతలు
రాగవశలై చూడముట్టిరి.

శబర వనితల సౌరులంగని
సవన నియమోల్లంఘనులునై

కామమోహన భావవశలై
గ్రాలునా గంధర్వులంగని

వామదేవ మహర్షి కోప
స్వాంతుడై శపియించె "శబర

స్త్రీల గర్భములం జనించుడు
శబర వృత్తులతో చరించుడు."

అంత గంధర్వులు మహాఋషి
చెంత శాపము గ్రమ్మరించుమ

టంచు మ్రొక్కగ సాధ్యపడదని
మంచి మాటల తోడ నిట్లనె

సర్వలోకాలేలు విష్ణువు
చరణ శరణము పొంది పొందిన

శాపమును పోగొట్టుకొనుడిక
బాప నా వశమునను లేదనె.

అపుడు గంధర్వులు మహానా
రాయణుని గని శాపవృత్తాం
తమును దెలిపి, పరాత్పరా ! గుణ

దయానిధి ! శాపమ్ము బాపుమ
టంచు గంధర్వులు నుతించిరి
అంచితమ్మగు గాననుతులన్.

బ్రాహ్మణుని శాపంబు బావగ
పరమ శివుడే శక్తుడని నా

రాయణుడు శివు చెంత కనుపగ
ప్రణుత హస్తులునై పడంకుచు

నంత గంధర్వులు శివుంగని
మహాదేవ! ఉమాపతీ! జగ
దీశ్వరా! ఓ శంకరా! శివ!

శాపమును నెడబాపు మిక మీ
శరణులము కాపాడవలెనన.

*　　*　　*

పరమానందముతో శివుడప్పుడు
కరుణతోడ నా గంధర్వుల గని

బ్రాహ్మణ శాపము – వ్యర్థముగాదని
అనుభవించవలెనని – మరలిట్లనె

పద్మనాభగిరి పరిసరమున గల
మాధవ వన సీమను శబరులునై

జీవించగ కాలాంతరమున నా
చిత్కాళ దర్శన భాగ్యముచేతన్

ఆవనసీమయు నవరకాశియై
అలరునపుడ మీ శాపము దొలగును

నాదర్శన సంస్తుతి యోగమునన్
మీదగు తొలి రూపము లేర్పడుననె.

గంగ వంశధారగ వర్ధిల్లగ
కాశి యనగ నీ క్షేత్రము భాసిలు

ఈ వనగిరులందే వసించెదము
పుణ్యతీర్థమై పురాణప్రస్తుతి

కెక్కుననుచు పరమేశ్వరుడంత
హ్లాదితుడై పార్వతితో తను ఒకటై

మధూక వృక్షపు ప్రమాను మూలమున
మనెగాదా నా మాధవ వనమున

నారద తుంబురులమితానందము
నను యాగము సంపూర్ణమొనర్పగ.

*  *  *  *

## ఆవాసం

అది వైజయంతమై యపురూపముగ వెల్గె
అది మహేంద్రావాస మగుటచే పొందెనా

అద్రి మహేంద్రాద్రియను పేరు దాన
నాతని పుత్రికయౌ జయంతివసించ

నది జయంతీ క్షేత్ర మన కీర్తిగాంచె
పద్మనాభుడు దాన భాసిల్లుటం జేసి

అది పద్మనాభగిరి యన యోగ్యమయ్యె
తద్వనసీమ మాధవుడుండుటం జేసి

మాధవ వన మన మహిని పేరొందె
అట విష్ణు మందిర బలరులటం జేసి య
ప్పురి "వైజయంతి" యన ధర పేరు గాంచె.

* * *

స్వర్ణరాగాది స్వచ్ఛంద భావుకులౌచు
అగణితానంద భాగ్యాలు బొందుచు దివ్య

శక్తులు దీపింపసాగు గంధర్వులా
వామదేవ మహర్షివలన శాపము నంది

ఆ గిరి వనములందలచిన శబరులం
దవతరించిరి మోహ వివశులై మిగుల

శబరులై తమ పూర్వశక్తులు బాసి
సామాన్య జనులగతి సాగుచు నావద్మ
నాభగిరి వన దివ్య శోభల దూలి

* * *

మృగముల వేటాడి
నగదేవతలగొల్చి

మధుపానమత్తులై
మాంసభక్షణచేసి

మోహవశులై కాల
మునుబుచ్చు వారిలో

చిత్రగాయకుడు సువి
శేషగాత్రుండై

చిత్రకడుపునబుట్టి
చెన్నొందినాడు.

* * *

ఆనందమందించు-ఆటపాటలతో
అటవీ వసంతానికతడె కోకిలగా

గానమధువులబంచి గణనీయుడయ్యె
సవరవీరులు మెచ్చు సద్గుణమూర్తిగా

బాహుబల విక్రమ ప్రభలు వెలుగొంద
పరలె శబరానందకరనాయకుండై

రమణీయ తేజోవిరాజ మానుడుగా
ఆజానుబాహువుల నపరరామునిగా

శస్త్రాస్త్ర విద్యావిశారదత్వమున
లోక విఖ్యాతుడౌ ఏకలవ్యునిగా

శివశక్తుడై యొప్పె చిత్రగాత్రుండు
గిరిదుర్గమారణ్య వరతరుల ఛాయన్

దిరుగునా మదకరుల గరువాలనడచు
ఉరుతరగాన మాధురుల నగలించు

గాత్రాన పాటలను కమ్మగాపాడు
మృతజంతుతతికూడ నతనిగానముతో
జీవములు బొంది చెచ్చెర దిరుగాడున్

పద్మనాభాన్విత పర్వత సీమన్
శబరులది గని మిగుల సంతోషమొందన్

వనలక్ష్మి శృంగార భాగ్యాల దనరెన్
ఫలపుష్ప సంపదల వర్షానమురిసెన్.

బాణ మరచేత గొన భార్గవుం(డనగా) దలపు
శబర రూపమున ప్రశస్తి తిన్ననిగా

మృగ శృంగయుతమైన తగు కిరీటముతో
శబరాంగనా సూనసాయకుండనగా

వడి దండయుగ్మాన కడు కండ లెగయ
గరి మీసముల ముఖ కాంతి పురి విప్ప

చిత్రగాత్రుని పేరు చెవి సోకినంత
అడవి రాజన గుండెలవయు కొండలకు
జీవతతులం గూర్చి చెప్పనేముండు.

* * *

తన పూర్వ జన్మవాసనచేత నీ యడవి
గాంధర్వ గాన రస గంగయై తరగెత్త

పలుకు చిలుకల ముద్దులొలుకు పచ్చదనాల
కోకిలారవరమ్య కోమల గాత్రాల

సరిగమ మదనిససలు స్వరహారములుగనా
వరగళమ్మున నిల్చి పరవశత్వమునంద

చిత్రగాత్రుని రాగ చింతనా లోకనము
మదమరాళమ్ముగతి మందాకినుల దేల

తుమ్మెదలు ఝుమ్మంచు తమ్మురలు మీటంగ
హరిణాలు చెంగనాలాడి తూగాడంగ

వరమయూరాలు కడుపురి విప్పియాడంగ
ఇల్లాలు చిత్తి హృది ఉల్లాస మొందంగ

తరులతాగుల్మములు తలలూపు చుండంగ
ఘనరాగ శోభలా
వనమెల్ల నిండెన్

ఎండు మాకులు చిగురు
జెండాల నెత్తెన్
మోడు మాకులు చిగురు
మోసు లెత్తెంగన్.

వనకాంత పచ్చనౌ వస్త్రాల గట్టి
పల్లవాలా చిత్తి పర్వమ్ము జాటు

చిత్తి ఒక్కొకమారు సీతమ్మ కాగ
శ్రీరాముడై వెల్గు చిత్రగాత్రుండు

నానా ప్రసూన వితాన వాసనలన్
వండి పౌరలును చిత్తి పరపు యౌవనము.

ఘమ ఘమాయితమైన తమకమ్ము లెగయ
చిత్తి ముఖ సౌరులవి చిత్తమలరించు

రతిరూపు నగలించు సతియనగ నడల
చిత్తి సోయగము పిచ్చెత్త చేసేను

చలిత శృంగార ధ్వజస్వరూపమున
చిత్రగాత్రుడు తనదు చిత్తి నలరించు.

మాధవ వన రతి మన్మధులనగా
శబర దంపతులు సాగిరి గిరిపై

సుధల నిండె నా సూన శోభలూ
మధురవములతో మధుపము లెగసెను

* * *

# ఆనందం

సవరాంగనాచిత్తి సల్లలిత సౌరభో
త్ఫుల్ల శరదిందు ముఖోల్లసన రాగశో

భానంద విరహ సంభరిత మధురాగాల
అడవి వచ్చని చిలుకలాకులై ఎగురంగ

గుబురు కొమ్మలు పూలగుత్తుళ్ళ నడయాడ
చిత్రగాత్రుని గానశేముషీరాగాలు

సరిగమ పదనిస స్వరనాద రసగతులు
మందార మకరంద మాధురీ పదబంధ

గీతికాలయలు జేగీయమానవ్రశో
భితములై శృంగారయుతములై కోకిలల

ఋతములై వనజన స్తుతములై గండుతు
మ్మెదల సందడి శబర సుదతీ ముఖాంబుజము

పూర్ణబింబాన నల్పునగవ్వు కనులతే
జములు మెరసే చలచ్చలిత నక్షత్రతతి

యట్ల, వనమెల్ల వియత్తలమ్మెదోప
తరులతా గుల్మసంతతి పుష్పఫలభరా

నంద సౌరభములానంద గీతాలల్లి
చిత్రగాత్రుని యశశ్రీగంగ గుణతరం

గామల కోమలాహ్లాద బంధురవినో
దమ్ములు జడచేతనమ్ములేకమ్ముగా

భూనభములానంద పూర్ణబంధమ్మై
చిత్రగాత్రుకు చిత్తిబిద్ధాన మకరంద

భోగాల యోగాల రాగాల తులదూగ
సుమనోహరంబుగా శృంగార వనముగా

మాధవ వనదీప్తులెసగెన్
మాహేంద్రగిరి శోభలలరెన్

*          *          *

ప్రణయగాధలు ప్రకృతి ఒడిలో
పల్లవించిన రాగలతికలు

పుష్పసౌరభ శోభలే జగ
ములను దనిపిన ప్రేమగీతులు

చిత్తి సుందరినే వరించెను
చిత్తినే తనలోన నిల్పెను

ఆమె తన కొక ప్రేమదేవత
ఆమె తన ప్రాణానిలమ్మను

చిత్రగాత్రుని రాగ సంభృత
జీవన ప్రద - రాగమాలిక

చిత్తి చిత్తము నలరచేసే
సేవలెన్నో తెలుపజాలను

గురుతుకిట్లని తెలుపరానివి
తెరువు కివియని చూవరానివి

సంజ్ఞలెన్నో ప్రణయ కథలకు
చక్కనైనవి చాలగలవను

ప్రేమయను రెండక్షరమ్ములు
కామపీడాదుల జయించెను

పలుకులో నర్థమ్ము మించును
వెలుగులో చాయను జయించును

ప్రణయ జీవుల ప్రణవనాదము
ప్రణవమునకే ప్రాణమౌనను

పక్షులవి జతకట్టి పీడవు
బ్రతుకు ప్రాణం బొకటి కొకరై

మనసు తానై మమత తానై
మాటతానై పాటతానై

ఒకరి నొక్కరు చూసుకొందురు
ఊసులెన్నో చాటుకొందురు.

చిత్రగాత్రుని గాన ఝరిలో
చిత్తి తరగై తేలి సాగును

చిత్తి సౌందర్యాబ్ధి లోపల
చిత్రగాత్రుడు నావయైమను.

# సమైక్యం

గిరివనములయం
దరమరికలు లే
కలరిన మనుజుల
కథలెరిగిన ప

క్షులలో చిలుకలు
తెలుపగ పలికిన
పలుకులు కోకిల
ములుకడు పాడగ

వలపు పురిని వి
ప్పగ మయూరములు
ఇంపులు నింపే
నృత్యము సల్పగ

చిత్రగాత్రు హృది
చెంగలించి లయ
గతుల నిండు రా
గాలాపనముల

చిత్రి చిత్ర రా
జీవములో నవ
మోహన భావ స
మూహములెన్నో

గిలిగింతలు కలి
గింపగమై పుల
కింత లెసగ నా
గినియై యాడగ

చిత్ర గాత్రు డౌక
చెట్టయి పాడగ
చిత్రి లతలుగా
చెట్టును చుట్టగ

మోహన తాపము
ముప్పిరి గొన నా
గమ్ములు రతి బం
ధమ్ముల పడగె

త్రినవై ముద్దులు
గొననా మాధవ
వన జీవులు రతి
పతులై కవయగ

వసంత ఋతు శో
భలు వరమానం
దమ్ముల మధు రస
ధారలె తనియగ

పూవులెల్లయు వికస నమ్మను
భావమున నొకటై రహించెను

వృక్ష లతికలనంతమైనను
ఎన్న నొక వనమై చెలంగెను

పుష్పొదులు బహు భంగులైనను
పొసగు వాసన లేకమైమను

పూలరంగుల వెన్నొయైనను
పూజలో నొక్కటిగ మారును

అందమగు హృదయాల పొందును
పొంద భృంగము లేకమై గను

తెట్టెలో తూట్లెన్నియున్నను
తేనె తీపియు ఒక్కటై మను

గిరి వనమ్ముల వరలు నరులును
ధరణి నేకోదరుల మేయను

పంచ భూతములందు నెలకొను
ప్రాణ మొకటని దైవమును గను

చావు పుట్టుకలనెడు రెండును
దేవుడను శివునకును లేవను

కుల మతమ్ముల వెన్నియైనను
కూడి మనుజుల ప్రేమ నొకటను
కూడి మానవ వృక్షమున మను

వనమునందలి నవర జనమును
ప్రసవ శోభలు ప్రస్తుతించును.

*　　　*　　　*

హితమిత మృదువచనమ్ముల
అతులిత మరియాదలతో
సుకవి మనోహర విశుద్ధ
సుమనస్సుమశోభలతో

మృదుపద భాసిత వదనలు
సదమల శృంగార గుణా
ర్ణవ వంచశరైక రూప
నవలలితాలంకరణల

రసభావోదయ వదన
ప్రసవ వికసితానందం
బెసగ నవర వనితాజన
సముదయమ్ము నవరపతుల

సమరసరాగముల గూడి
మదమాతంగమ్ముల గతి
మాధవ వనసదనమ్ముల
మదన క్రియలే సల్పుచు

సరసీరుహ వదనమ్ముల
మెరిసే మధువములవోలె
సరసవినోదాల విలా
సాల దూలు మధురస పా
నాల మత్తచిత్తాలన్
దేలియాడు మాధవ వన
లీలలు మోహన రాగర
సాలంకృత దీధితులం
వరగాన రసోజ్వల సం
భరితాంతః కరణులగుచు

మధూక పుష్పాసవాల
మాధుర్యమ్ముల దలచే
మందానిల మకరందసు
మాల మాలికలుగొలిచే
సవరదంపతుల జీవన
సౌభాగ్యం ఘనముకదా
సమైఖ్యసంరంభమ్మును
సాధించిన వనముకదా

*　　*　　*

ఫలపుష్ప సౌభాగ్యములతోడ తరులతా
గుల్మములు మురిసెనా గోవింద వనమందు

పశు పక్షి మృగవితతి వర క్రిమి కీటకా
దులు కామ మోహముల చెలగి యానందించు

సవర దంపతుల స్వేచ్ఛా జీవనా రామ
మందు రతిపతులు మోహానందకేళివి

లాసవిలోల విభ్రమ హాసరోచిన్న
వానంద మందిర సుఖా సన్మోత్రా

గోదయమ్మై యొప్పు
గోవింద వనమునన్

*　　　*　　　*

చిత్రినే బలుమారు
చిత్తమున దలచుకొను

చిన్ముద్ర దాల్చితా
చిత్రముగ నిల్చుకొను

మోహాతప్పుండౌచు
మోసులెత్తే భావ

ముల రాగ సంపత్తు
లెద పిండ రేకెత్తు

ఆరభటి భృంగ శృం
గార సరాగసం

భారసమీరగీ
తాలాపనలమధు

ధారాధ రా ఌం ధ్య
పొడమినంతన యడవి

పున్నమియ్యై వెలిగె

# అలంకారం

రంగు గింజల సరులు పొంగు ఎదలన్నాద
గవ్వ పేరులు మెడల గర్వాల కదలాడ

చెవుల జుంకాలు నచ్చిన మాటలందూల
పొట్టివగు పెద్దవగు పోగులు గంటీలు

కానికిపోగులు లోలకులు పూల బుట్టాలు
పుడకలు - పుల్లలింపుగ చెవుల కదలాడ

పిసిడులందున నెగడు పసిడి పూవరసలు
సిగపూల తళుకులు సగరంపు కుప్పెలు

కుప్పెలకు సైదోడు గొప్ప పింపిణు లొప్ప
పింపిణుల పసల సొంపెసగ నాగరములు

జడపూల సొగసులు జడగంట లందాలు
వంకకొప్పున నెలవంక బిళ్ళలసౌరు

పుల్ల గజ్జెలు కదలు పూలచుక్కల జాటు
టెంకాయ కొప్పుల టెక్కులే సైబల్కు

పచ్చ గుమ్మడి పూలు పండగే పండగను
గొలుసులందే కలిసి కులుకు తాయెత్తులు

బిళ్ళ పేరులవెన్నొ త్రుళ్ళిపడ నెదలందు
కంటెలు తీగెలు కదలాడ మెడలలో
ముత్తేలు పగడాల ముద్దయిన దండలం

తళుకొత్తు ముక్కు పుడకల రాళ్ళపోగులు
నతులు మోహనోన్మత్తులజేయు ముఖ

పద్మకాంతులు శబర పతుల వశలంజేయు
మదవతుల శృంగార పదపల్లవాల రా

చిల్క పిండులు పలుకులొల్కురాగ రసాల
దూలు కోయిలల పందేలు వేయగ జూచు

నడల సోయగపు సవ్వడులు నమలుల గూడ
మృగనయన లనగ లేళ్ళగసి యానందించు
పరుగులెత్తగ నెంచు పరువాల దిలకించు

జడల కదలిక లెరిగి నడయాడు నాగములు
గరుపతనముంజాటు నుదు ఉరోజశ్రీలు

బిగువుటొడ్డాణాల పెరగని నడుములే
నడికట్టు పుట్టాల తడిమి ఉన్నటు దెల్పు

ముంజేతి కడియాలు యంజలుల ఘటియించు
కంకణమ్ములనంటి కడియాలు తూగాడు

కాళ్ళందు గల వెండి కడియములు తోడాలు
శబర కాంతా విలాసాత్మకానందాల

ఘనత జాటే యలంకార స్వరూపాలు
కాహళ వాయిద్య గంభీర నాదాలు

కరతాళమోదంపు కమనీయ హాసాలు
కొమ్ములనాదాలు కొండలే నిండగా

భేరీల మ్రోతలు పీకల తుత్తుర్లు
దుర్గపూజావేళ దుందుభి ధ్వానాలు

ఆట పాటలు చెప్ప నలవిగానివి కాగ
వన పర్వతావాస జన వైభవాలుగా

ప్రకృతి రమానంద భావాన దేలగా
శక్తి పూజలు సల్పు శబర సమృద్ధిగా

మాధవనలక్ష్మి మహిత వసంతాల
సకల జగచ్ఛాంతి సంరంభ గీతాల

శబర జనతానంద సంధాయకమ్ముగా
కొండదేవత పూజ లూ ఘనముగా
కోరిసేయగ నాయెనూ

# ద్వితీయస్కంధము

## శ్రీ పర్వతం

శ్రీశైల పర్వత శిఖరాగ్రమున రస
శ్రీవిభుడు శివుడు నిక్షేపమై ఉండగా

కొండమల్లెలు వనమునిండ బూచినవయ్యో
మధుకరానంద వాక్సుధలే జగమునిండె

యోగ సుక్షేత్రమై త్యాగమోక్షంబునై
అవరకైలాసమే యన ధరణిమెరయన్

భ్రమరంభికానాథ! పరమేశ్వరా! యోగ
యాగాధిపా! నిర్జరానంద సామ్రాజ్య!

మృత్యుంజయాయంచు
నిత్యంబు పూజించు
పూజారి జంగముడు
పూచిన పూలతో
తోచిన విధముగా.

*  *  *

ఏ ఆకు ఏ పూవు లేజలము లేమంత్ర
ములు శివార్చనకు సరిపోవునో యెరుగడా

తనికి చిక్కిన వస్తుతతుల సమకూర్చి శి
వార్పణమ్మని భక్తినానందముగ మెచ్చి

అనుదినము మల్లికార్జుని గొల్చునిచ్చన్
అతని ముద్దున పూచినట్టి గుణాంగి ఏ

కైక పుత్రిక భువనైక సుందరగాత్రి
చిత్కళపేర ప్రసిద్ధిమై వరలెన్

పంచాక్షరీ మంత్ర పరిపూతులైన ముని
గణము పాతాళ గంగా స్నాన మొనరించి

శశిధరుని మదిని ప్రశస్తిగా కొలుచుకొని
చెట్టి నీడల విశిష్టతనుండ చిత్కళయు

తండ్రి జంగమునాజ్ఞ దాల్చియేతన్మని
గణముల సేవలన్ గడపు కాల్చమ్మును.

* * *

వసితనము తనకు తాపసుల మధ్యన పొగె
భక్తి శ్రద్ధలు శివునిపై పెరిగె చిత్కళకు

ఆట పాటలలోన ఆ శంభులీలలే
అనవరతముందల్చు నానందముంజెందు

ఆకలిదప్పికల నరయక శివునందె
ఏకాగ్రమతి గలిగి సాకారునిగ గొల్చు

అన్నోదకాలందు నా దైవమునె గాంచు
నిర్మల హృదయాన నిల్చు నా శివుడను

శివుని గొప్పల జెప్ప చెవి యొగ్గి వినుచుండు
భవ దుఃఖముల బాప శివుడే సమర్థుడను

మరణ మొక్కటియె లేని మహనీయుడాతడను
కరుణాలవాలుడా కైలాసపతి యను

గంగ సిగ్గున జటాగ్రమున నిలిచందుకను
అతడు కళానిధి యని జాటు శశిరేఖ

పగలేని వాడంచు పన్నగాలే చాట
విషము గళమున నిల్పి విషహరుడె శివుడను

పార్వతి తనకర్ధభాగమై యర్థాధి
పతి యాతడన్న సంగతి జాటుచున్నదను.

శివలీల లనుభవించిన జన్మ జన్మమను
శివపూజచేయు సుస్మిత వదన చిత్కళకు

బాల్యము వీడెను
ప్రాయము కలిగెను

చిత్కళ యౌవన జీవన తేజము
పరశివు చింతన వరమై సాగెను

ఐహిక వాంఛల నంతమొనర్చగ
నిరతము శివభక్తుల పూజించుచు
కాలము గడుపుచు కన్పడె చిత్కళ

బంధువు లపుడప్పుడు రాబందుల
వలె పొడుపుల నొవ్వగ పలుకాడిరి

ఆ ముద్దగు నీ
యంద మదెందుకు
ఆ యౌవన సో
యగము లవెందుకు

పతి సౌభాగ్యమె
పడతికి ముఖ్యము
మగ దిక్కును పొం
దగ చూపును సా

రించ మదిని యో
చించు మటంచును
అనుదిన మిట్లాడే చుట్టాలను
గని తనమది నొవ్వగ మాట్లాడదు
చిత్తము లోపల చిత్కళ దలచెను.

* * *

సకల తీర్థానంద సంధాయకమ్ముగా
విమల సౌధారామ వినుత ప్రసస్తిగా

పాపక్షయాకార పరిశోభితముగా
పుణ్యరాశియన్న పూర్ణభాగ్యముగా

వరలు విశ్వేశ్వరావాస స్థలముగా
వెలుగులీనే ఢుంఠి విఘ్నేశు నెలవై

చెలువారుచున్న కాశీపురముజేరి
మోక్షపతి శివుని తావీక్షించదలచి
ఎవరికేమాత్రమ్ము నెరుకజేయకనే

*                    *

కాశికి పయనముగట్టెను చిత్కళ
శ్రీశైలముదిగి ఉమామహేశ్వర

భాసురమూర్తిని ప్రార్థించినదై
ఎన్నగ నేలేశ్వర మేతెంచెను

తిన్నగీశ్వరుని మదిలో గొలిచెను
ముదిగొండయు తన హృదిలో మెదలగ

వీరభద్రుగన వేగచేరెనట
శివభక్తులు వచ్చిరి వారలతో

కూడి కీసరను గొప్ప క్షేత్రమని
జంగమురాలుగ సాగిన చిత్కళ

చేరెను సేవించెను లింగేశుని
కాళేశ్వరమును కన్నులగాంచియు

ముక్తేశ్వరునిన్ మోదమునంగని
కాలినడకనే కదలెను చిత్కళ

ద్రాక్షారామము దర్శించుటకై
అచటినుండి - అమరావతీశ్వరుని

తనివిదీర దర్శన మొనర్చుకొని
భవ్యమైన బెజవాడ కనక దు

ర్గాంబికేశ్వరుని ఆరాధించెను
కాశిని మదిలో కడు నూహించుచు

దర్శన లక్ష్యము తనలో నింపుక
శివ శివ శివ శివ శివశివయనుకొని

ఒక్కత బడలిక లెక్కచేయకయ
సాగెను సాగెను సాగెను చిత్కళ.

* * *

# పద్మనాభగిరి

కన శుక్లపక్షమేకాదశీ దినములవి
పాల వెన్నెలలు పర్వత సానువుల నిండ

గగనాన తోడుచుక్కలు గూడ రాకా సు
ధాకరు డఖండ జోత్స్నాభాండమై వెల్గ
అవి కొండలడవులో అంతుబట్టకసాగె

*　　　*　　　*

కొండపై పొదరిండ్ల గూడేన శబరిజన
నృత్యనటనా విలాసోత్సవాలంగూడి

చిత్రగాయకుడు తన చిత్తితో పెనవేయ
ఆడిరమ్మా ఆటలూ - అడుగేసి
పాడిరమ్మా పాటలూ.

దోర వయసున శబరదోయి ఆనందాల
చప్పట్ల ఛరచు ముచ్చట గొల్పురాగాల
అందమగు అల్లిబిల్లాటలే చిటికేసి
ఆడిరమ్మా ఆటలూ చిందేసి
పాడిరమ్మా పాటలూ.

ఒకరి ప్రక్కన నొకరు నొయ్యారముగ నిల్చి
ఒకరి చేతుల నొకరు ఒప్పుగా బట్టుకొని

ఆడ మగ భేదాలు కూడియాడే వెన్నె
లాట పాటలు శబర నాయకుండగు చిత్ర

గాయకుని రాగ భోగాల గూడెంబెల్ల
చి త్తి సింగారాల పొత్తు చాటిన రీతి

ఆట పాటలనెన్నో ఆడిపాడిరి జరా
సవరలు, శుద్ధాదికావ సవరులు కూడి

అలిసి, బొబ్బిలి, పెక్కులులు భేదమతి వీడి
మధుపానమున మదోన్మత్తులై యలసిపో

నాడిరమ్మా ఆటలూ కొండపై
పాడిరమ్మా పాటలూ.

కోళ్ళు గూడేన కొక్కొరకో యటంచు కూ
సెడు వేళ దెలియని కడు గురక నిదురవో

నడవి జంతువులు నిట్టటు దిర్గుచుండ మా
ధవ వనము జేరె చిత్కళ దారి దప్పి యా

కొండలో మార్గాలు బండ గుర్తులె కాగ
గాఢ వనమున తోవ గానక నొక దీర్ఘ

సాల వృక్షము మొదట బేలగా చిత్కళయు
కూలబడి చింతించుకొనుచుండె నాహార

నిద్రలు కరువయ్యె భద్రత దోపని
ఘోరాటవిని భయము గొల్పు క్రూరమృగాల

రొదలు పక్షుల నాద మెదల భీతులు నింప
చిత్కళ చలి వణకుచే నిద్ర గనదాయె

వృక్షమూలాన నట్టిటు పచారులు సేయు
సమయాన వేటాడు తమకమున శబరనా
యకుడచట కరుదెంచెనదె మృగంబనుభ్రమన్

*   *   *

బాణమును సంధించ
బూనెనా చిత్రగా
త్రుడువేగ చిత్కళయు
తుమ్మె పెద్దగ నంత
తోయజాక్షినిగాంచె

*   *   *

మేఘమున తళుకొత్తు మెరుపువలెకాదు కా
దిసుమంత నల్పుగన దసమానపూర్ణశశి

ముఖినడవి నీచెట్టుమొదల దిరుగాడుచే
మని సుంత మనసులో ననుమానమొదవగా

తళతళలమెరయు దంతచ్ఛాయలా చిత్క
ళానంద ముఖమండలాన దీపించగా

తన తనూలత పసిడిఘనతనే కొలిచెనో
కనుపించె నురు ఉరోజనగ శృంగారదే
వతగనాతనికి నా యతివనుజేరి

దివినుండి భువికి నే
తెంచిన నెలవో

కవివరుల భావలో
కానవెలిగే సరస్వతివో కనగనీ వతిలోకసుందరీ!
ఎవరవో వనితా।

ఈ యడవి నొంటిగా
చరియించుటాశయ
మ్మెరిగించరాదా

అని చిత్రగాత్రుడాడిన పల్కులకు చలిం
చిన చిత్కళాతనింగని యిప్పుడేమి నే

చెప్పజాలను దారిదప్పి వనమున దిరు
గాడి యలసితిని నిక్కముగ నాకిపుడు

ఆకలిదీర నాహార మిప్పించు
ఆపైన వృత్తాంతమడుగ నెరిగింతు :

అని పల్కనంతనా
తని యానతిన్ బియ్య
మును పప్పు, దుంప లె
ల్లను కాయకూరలను

గొని వచ్చె నొకడు నా
తనితోడ పండ్లొకడు.

అవి చిత్రకళకు జూపి ఆరగించు మటంచు
గాయకుడిలు చేరె కమ్మని భావాల

*　　　*　　　*

కనగ బంగారు బొ
మ్మన నొప్పుచున్నయది

పలుకు మూటలు గల
చిలుకలాగున్నయది

జీవకళ నడచి వ
చ్చిన దేహమనగనది

తను పెండ్లియాడ మె
చ్చునా లేదొాయని మదిని

ఆమె మధు దేవతే
యన దోచుచున్నదని

నల్లనాగనగ జడ
నల్లెనో సుదతి కను

గవనీటమీలవలె
కదలాడుచున్నవని

ఆ మీలవేటాడు
నట్లున్న బాణాల
వలెనున్న కనుబొమల
దలచి చూచే చెవులు

శ్రీస్వరూపములనగ
సర్వాంగ దర్శనో
త్సాహంబు మదిమెదల

గతజన్మలోని సం
స్కార పరిమళమేదో
కమలముఖి చిత్కళను

కాంచినంతన మోహ
వశుని జేసినది దా
వాగ్ని కరిగే వెన్న

వలె చిత్రగాత్రుండు
క్షణమొక దినముగా
గడపుచున్నంతలో

జలకమాడినది చిత్కళ వంశధారలో
వటవృక్షమూలమున బసచేయ నూడ్చినది

చెట్టు మొదటనె పొయ్యి పెట్టినది వండినది
వెదురు బియ్యము నుడక పెట్టె దుంపల చేర్చి

వార్చె కాయలను నింపగు వెచ్చముల గూర్చి
పరశివున కత్యంత భక్తి నైవేద్యమిడి

వరమతిని భుజియించి కరముగా త్రేన్చి తా
విశ్రాంతి బొందె పవిత్ర భావముతో

చిత్కళ సేదదీరగ కున్కు పిదవ తా
చేరె చిత్కళ చోటు చిత్రగాత్రుండు.

*　　*　　*

హిమనగమ్మున నమ్మ
హీసురుడు ప్రవరు డ
త్యంతానురాగ మో
హనరూపయౌ వ రూ
ధిని గాంచినట్లు చి
త్కళను గని మోహ నో
త్కంఠ భావాన నా
చిత్రగాత్రుడు సుదతి :

*　　*　　*

ఏఊరు ఏవాడ ఈవనికి నీరాక
ఏతీరు వనిమీద ఈదారి నీవిట్లు
ఏతెంచినావు నీదేపేరు పూస గు
చ్చిన రీతి చక్కగా వినదెల్పు మన్నంత

చూచె నాతని మోము చూపు తూపుననిల్పి
పద్మనాభాంకగిరి వనహృది చలించగా

నాపేరు చిత్కళ
నాది శ్రీశైలం
జంగమ కులమున
జన్మించినాను
జంగమారాధన
జరుప కాంక్షింతు

పూజారి పుత్రికను పురహరుని గనగ నా
కాశి చేరగ సాగికానలో నేను
దారి తప్పితిగాన దారి చూపించి
కాశి కంపుము నన్ను కల్యాణతేజా !

ఓ భువనమోహనా !
ఓ మధుర గాత్రా !
ఓ వరమూర్తీ !
ఓ దివ్యరూపా !

విమలస్వరూపుడౌ విశ్వనాథుని గాంచ
కాశి మార్గము దెలిపి కరుణించరాదా

అన యిట్లు చిత్కళను ఘనముగా జూచి
కడు క్రూరమృగ జంతుకాననమందు

చోరభయములు మెండు దారులు గనవు
ఎట్లు కాశీపట్నమేగ దలచెదవు

దుర్గమారణ్యమిది తోయజనయనా!
ఘనజీవనదులనే గతి దాటగలవు

కంటకాన్వితమె మార్గముల్లెల్లచూడు
ఎక్కడికాశి నీవెక్కడున్నావు
వనలక్ష్మిశోభల వరలుచున్నావు

ఒంటిదానవు తోడువెంటకన్పడదు
చుక్కవలెనున్నావు చక్కదనాన

ఈ యడవి శబరకుల నాయకుడ నేను
ఎన్నెన్నొ యిడుముల నెదిరించినాను

చిత్కళా! నను పతిగ చేపట్టలేవా
ననుబొంది వనజీవనము చేయలేవా

చిత్రగాయకుడనగ జీవించుచుంటి
పెట్టపుంజులుకూడి నట్టడవిలోన
హాయిగా జీవించుటరయవో భామ!

*                    *

అన విని చిత్కళ
మనమున యోచిం
చినదై స్పందిం
చినదానిగ నా
చిత్రగాత్రుగాం
చినదై వలుకా
డినదయ్యెనిటుల్

*                    *

నీ జాతి కన్యతో నీకు పెండిలియయ్యె
అవివాహితను నన్ను నాడెదేగతి పెండ్లి

కులముదానిని గాదు తలచి నను చేపట్ట
నేరవా సవతుల పోరు లోకాన

వలపు సందిట చేర్చి మెలగునా వేళ
కులము వారలు మెచ్చి కొలుతురా నిన్ను

వలసిన సదుపాయముల గూర్తు నంటి
శివ పూజ సల్పి భుజింతు నేనెపుడు

ఒక్క వరలో కత్తులొరయునా రెండు
అట్లాడు చిత్కళను అరసి గాయకుడు

కలలోన జరుగు పెండిలి యందు చూడు
ఈడు జోడే కలియు నేగతి గన్న

కుల భేద భావనలు తలపలేమెందు
కల నిజమ్మరయు లోకమున శుభాంగి!

*  *  *

అన్న మాత్రన మారుబల్కక
మిన్నకుండిన చిత్కళంగని
సుందరీ నాదాన వైతివి
సుదినమే యిట్లాడుచుంటివి.

చిత్రిమత్కల కాంతెయైనా
చిత్తహారిణివైతి వీవే

చిత్రమే మరియంచు పెండ్లికి
సిద్ధపడి యా చిత్రగాయకు
డాలు కెరిగించెను సువార్తను

చిత్రిపతితో చేసెవాదన
ఆలి యుండగ వేరు సతితో

కోర్కె కాపుర మేరుపెడుదువ
నేనులేనా మరోకాంతను

ఏల పెండ్లాడె డవధర్మము
పాల బడుదువె జాలి లేదా

అన్న చిత్తిని బుజ్జగించీ
ఎన్న నాయకులకు సరింబడు

శివుడు నిద్దరి కవదెవతిగా
నాయకునకు గుణమ్ముగల సతు
లిర్వురున్నా వర్వు తగ్గదు

మాటవిను మీనాటినుండియు
వండుగానీ బెండుగాని

పాలుగానీ పూలుగానీ
సగము సగముగ సరిగ నేనే
వంచియిత్తును వంపకములో

పోరు కూడని విధముగానే
వేరు వేరుగ నుండుటకు కా

వలసినట్టి నివాసముల నే
ర్పరచి కాపురమేను చేసెద

అంచు చిత్తిని ఊరడించెను
ఆమె మౌనము దాల్చెనప్పుడు
విధి విలాసము వధువు చిక్కుట.

చిత్రగాత్రుడు చేవనందెను
గాలిగంతులు వేయసాగెను

ప్రకృతి వికృతుల పరవసించెను
పరిణయ ప్రభలరయ మెరిసెను

మబ్బుతెరలవి మా సెనింగిని
మెరిసె చుక్కలు మిలమిలాయని

* * *

పాతయిలు కొత్తయిలు వక్కవక్కన నిల్చె
సతుల భేదాలు విభజనము గావించబడె

బ్రతుకులత్యాన నేర్పడె మార్గములు రెండు
రోజుకొక్కరగూడి మోజుపొందగనాయె

ఇద్దరాళ్ళకు మధ్యనిరకాటమున బడ్డ
కలతమతి ఇహపరమ్ముల చింతసల్పినది

అట్టిట్టులాకర్ష ణుట్టిపడె చిత్రగా
త్రుడు విచిత్రానుభూతుల నందుటయ్యెమది

అరయశబ్దముల కర్థాఖ్యలు వేరయ్యె
ఆగమాదేశాల నాటాడెనక్కరలు

సంధిసమాసాలు చర్చనీయాలయ్యె
కరగవేమూసలో కష్టసుఖములు గూడి

దినవెచ్చములకు చింతిలుటాయె నంతనా
ఇద్దరిండ్లకు మధ్యనేపుగా పెరిగి చ

క్కగను మధూక వృక్షమ్ము కన్పడుచుండె
సర్వకాలప్రసవసముదాయములతో
మాధవ వనమహత్వము జాటనిలచి

కొన్ని పట్టుల జుంటి తేనెలు
కొన్ని పట్టుల పుట్టతేనెలు

కొన్ని పట్టుల చిన్న తేనెలు
కొన్ని పట్టుల పెద్ద తేనెలు

ఆకు దొప్పల సేకరించి
అమృత మట్టుల నారగించి

శబర జనములు సాహసమ్ముల
సంచరించుచు సాగచూతురు.

తొవ్వకొని దిను దుంపలైనా
కోరిపొందే కొవ్వులైనా

పొట్టిగున్నా గట్టివారై
పట్టుదలతో బరగుచుందురు.

ఆట పాటల నాడి పాడుదు
రట్టులే వేటాడ జాలుదు
రఖిల సవరలు నాదరమ్మున
కొండ దేవత కొలువు దీర్తురు

చేకుక ్రల ఆకుపాకలు
పొదరుటిండ్లును పూరిగుడిసెలు
వెదురు తడికల సదనములు సువి
శాల సౌందర్యాల నలరగ

ప్రాకుతీగల పందిరులతో
ఇంటి యిడుపులనంటి అరుగులు
తెలుపు చుక్కల దెలుపు బొట్టుల
పసుపు కుంకుమ లెసగ దీర్చరు

మనిషి మనిషిని కనగ మురిసే
మాయ గూడని మాటలాడుచు

మమత చాటే మంచి మనసున
మనెడు మాధవ వన శబరులకు

కట్టె మంచెలు గడల మంచాల్
గడ్డి పరుపులు కంచె చాపలు

దోనె తొట్టులు బానకాగులు
తట్ట బుట్టలు తడక గుమ్మలు

వెదురు బుర్రలు పదును కత్తులు
అమ్ము పొదిరులు అడవి జంతువు

లాస్తిపాస్తులు నఖిల వనములు
భూచరమ్ములు - ఖేచరమ్ములు

వనచరములై ఘనత జాటగ
వనమె జీవన పథముగా మరి

యాదనిచ్చే యమల జీవన
గాథలకు సరిగాగ బతికే

సవర జాతులు జరుపుకొందురు
కొండ దేవర పండగలను

వరుణ దేవత పండగలను
వరస వన దేవతల గొల్తురు.
పలలమును గడ్డలను తిందురు

కసరు కాయలు కందమూలాల్
కొసరి మెసవుచు కోరి మధువుల

గ్రోలి మత్తుల దేలువారలు
శబరి భక్తిని చాటువారలు

పసిమి ఛాయల వసతులేర్పడ
అతుల జల మారుతము లలవడ
కొండ కోనల నండగా గొని

దండి చాటే కండ బలమున
ఆట పాటల మేటి దొరలన

బతుకువెతలను బాపుబాటల
మగకు పుంజని మగువ పెట్టని

కొండరాజులు బండగుర్తుల
అడవిపెన్నిధులనగ జాలుచు

అడవినెడబాటన్న మెచ్చని
నవరజనములు సచ్చరిత్రులు

నాగరికుడౌ నరుని కాద
ర్శమ్ము శబరుడు బతుకుతెరువున

నాగరికుడౌ నరునిలో దు
ష్టత్వమొకటే చావదయ్యెను

చదువునేర్చెను శాస్త్రమరసెను
గుణముగానిది కులము దలచెను

మమత గూర్చని మతము గొలిచెను
కరుణ నింపని కవిత లల్లెను
అత దశాంతికి అధిపుడయ్యెను

భుక్తిముక్తులు మూఢజీవుల
కెల్ల జిక్కను వల్లనన్నా

పరమపావన భక్తిమార్గము
కలిగి బతుకుట ఘనత రన్నా!

* * *

నరుడు నిల్పిన పురములెల్లను
మురికి బట్టగ పరమ శివుడే

గిరివనమ్ములకరిగి నిలిచెను
పురహరుండదన బరగి యెప్పుడు

*　　　*　　　*

అతడు ప్రవరునిమించు నపురూపవంతుండు
ఆమె చూడగ వరూధిని కక్క - అందాన

అది హిమాలయమైతె
ఇది పద్మనాభగిరి

అచట ద్రాక్షాలతలు అలమెనో లేదో కా
నిచట గలవవి గెలల నింపైన శోభతో

గంధర్వవతి మోహగాఢ తమముం బాప
చిత్కళానంద సంచితమోగదీపమై

అద్వైత భక్తి మాహాత్మ్యంబు జాటి యా
చిత్రగాత్రుని యశశ్రీ దిక్కులకు ప్రాక
ముఖలింగ సంభవమ్మున మను కథలో

*　　　*　　　*

ధగధగని దేహరుచి
నిగనిగని కుందనపు
కాంతివైభవము చి
త్కళలోన చెలువార

*　　　*　　　*

అరివీరలోక భీ
కర పౌరుషాకార

ముఖతేజమలర న
ద్భుతగాత్రుడై చిత్ర
గాయకుడు శబర జన
నాయకుండయ్యెనా
గంగవంశపు రాజ్య
కళ్యాణ శోభలవి

వెయ్యేండ్లు నిచ్చోట
విరిసి కళలందేల.

*　　　*　　　*

ఇమ్ముగ వనాన రుచి
రమ్ముగ తరుల్ మధుర
సమ్ము లొాదవన్ ఫల భ
రమ్ములగుచున్ - తో

రమ్ముగ లతల్ వికస
నమ్ముల సుగంధ గరు
వమ్ముల మనోహర సు
మమ్ములను గూర్చన్

ఘుమ్మనగ బంభర కు
లమ్ముల సరాగ సుధ
లిమ్ముగ వరించు విధు
నమ్ములై మెలగన్.

క్రమ్మని కల స్వనవ
రమ్ములలరించు నిన
దమ్ములు వనిన్ చకో
రమ్ములు నెమళ్ళున్.

సుందర మధూక తరు
లందు మధు ధారలు ప
సందుగ రస ప్రసవ
విందు లొనరించన్

వందిత గుణస్వర మ
రంద గురు భృంగ మర
విందవిలసద్వకుళ
బృంద గతులన్ మా

కంద ఫలశోభరుచి
డెంద మలరంగ నర
విందవరగంధ తరు
చందన విరాజిన్

పొందె మధుమాస విభు
నందు వనకాంత రతు
లంది ముదమొంది మన
మందు రసరాజిన్

*　　*　　*

కొండరాజై శబర
గూడెన ఒకనాడు

చిత్రగాత్రుడు తనదు
చిత్తి చిత్కళలతో

కుడి యెడమలై వెంట
నడచిరా నడవిలో

పాదపములెన్నెన్నొ
బాటపక్కన నిలచి

బహు జయధ్వానముల
స్వాగతించిన విధము

మోదుగులు నెత్రనౌ
పూలహారతులిడగ

బొండుమల్లియలు సిగ
నిండ పూవులజుట్టి

ఎర్రగన్నేరలు తను
వెల్లపూచిన రాగ

సరముల గతిగుల్కు
సంపెంగలెదురయ్యె

నేరెడు, మారెడుల్
నిమ్మవెదురులు చేకు

పెద్దనౌ మద్దులు
తిప్పచెట్టులు వచ్చ

తోరణమ్ములు గట్టి
దారులందున నిల్చి

కొండరాజని వనము
కొలిచెనో ఈరీతి

చిత్రగాత్రుని యంటి
చిత్తి చిత్కళలు కుడి

ఎడమ కన్నుల వోలె
నడయాడ నా దారి

తేటిబోంట్లును పూవు
దేనెలనాని ఝుం

కృతగీతములను స్వా
గతము వల్కంగ నా

వనలక్ష్మి యానంద
వైభవమ్మే చాట

పరిమళించె విశాల
ప్రకృతి భారత సుకృతి.

*   *   *

# సవర జీవనం

పులి తోలు పుట్టాలు
చలి ఉడుపులై నెమ
లీక పొరకలె ఇంటి
పాకలందున నిల్ప

ఇంటి ముంగిట గలుగు
ఇడుపులకు నట్టిట్టు
అలికిన అరుగులకు
తెలుపు సున్నపు బొట్లు

పసుపు కుంకుమ లిండ్ల
బండారు పట్టలై
దుశర తీగెల బుట్లు
తోలు డప్పులు చెర్ల

కోలలు తాళ్ళు ఉ
ట్లంగూడి చెక్క తొ
ట్లకు తోడు కుదురు కుం
దెనలు తిత్తులు వంటి

పనిముట్లు చెకుముకి
సంచులు రోళ్ళు పా
షాణ సంబంధ వి
స్తార వస్తువులు భా

షన నిండె శబర జీ
వనము ఘనమ్మై

*         *         *

చెంగుమని యెగురేటి చెంగనాలాటలు
గిర్రునదిరుగు పింగిరులాటలే గాదు

కచ్చకాయలతోడ అచ్చనలాడెదరు
వరుగు, దుముకులు నెగబాకునాటలు బిందు

గుద్దిగుర్తులగోలు గుండ్లాటచెర్లకో
లలబట్టియాడు నాటలవెన్నొ పులిజూద

ముల చెమ్మచెక్కాట ముక్కుపుడకాటలు
లేచి కూర్చుండి ఎగిరేయాటలందెన్నొ

పదములీలలు ఏల పాటలు దర్వులు
జోలలు కొట్టింపు కోలలు తధిమికిట

తాత్రైకనృత్యాలు తందానగీతాలు
నవరసానంద జోత్స్నాబద్ధమోదాలు

మాధవ వన విహిత మంగళానందాలు
సర్వసవరల కాత్మసమ్మతము గానాలు

*         *         *

ఎన్ని వసంతాల నీయడవి చూచెనో
ఎన్నెన్ని మృగతతులు నీయడవి దిరిగెనో

అడవిలోగల వింతలవి దెల్పిరెవ్వారు
ఫలపుష్ప వృక్షాలపై నిల్చు పక్షులే

పుడమి వింతల గాంచి అడవికి దెలిపెనో
అడవి జనముల బతుకు పుడమికి చెప్పెనో

తమ తమ యాకలి దప్పికలు ఒకదాని
కొకటి కన్నం బగుచు నుండు మక్కువలు

ఏ కావ్య రూపాల నెరిగించ జాలిరో
దిక్కులు దోచని దీనగాథలను

బతికున్న చెట్లె చెప్పగ జాలుగాద
ఎన్ని యుగాలుగా నున్నదో యడవి

ఎన్ని యోగాలు చవిగొన్నదో చూడ
మనుజాళి ఈ చెట్ల మాటున చేరి

మునులైన వారి కథలను పాడినారో
వ్యాస వల్మీకాది వాసమ్ములనగా

పరశురామాది ప్రభువులు గన్నవనగా
బుద్ధాది మునుల విశుద్ధ గతులెరిగి

పరిమళానంద శుభకరముల నలరి
భావచంద్రికలతో పరిపుష్టిగాంచి

బహు భోగభాగ్యాల ప్రబలెనో యనగ
యోగాలు రాగాలు యాగాలు దెలిసి

భాషలనెన్నియో పోషించె ననగా
గురుకులమ్ముల గూడి కొలిచిన దనగా

మరచి కష్టాల సన్మార్గాల జూపి
మనిన ఈ యడవియే మానవావళికి

అన్నోదకాలు ప్రాణానిలాలిచ్చే
కష్ట జీవులకు సంతుష్టి నొడ గూర్చి
కల్యాణ పథముగా గ్రాలు నీయడవి.

*　　　*　　　*

# సవర చిత్తారి

ఆకుపాకలె ఆలయమ్ములు
అరుగులే సింహాసనమ్ములు

పంగకట్టెలపైన నిలిపిన
పూరిపంచల బొడ్డుగుడిసెలు
హర్మ్య శిఖరములనగ సవరుల
కాట పట్టులు అడవికొండలు

ప్రకృతి శోభల పరిమళించే
వాసిపొందిన పట్టణమ్ములు
గోడపూతల కూడి చిత్రము
లెన్నియో బహుమన్నికైనవి

రంగురంగుల రాగలతికల
చిగురు కొమ్మల వగరు కాయల
ఆకువచ్చని కోకలందున
అణగి కదలే అలరుగుత్తులు

పండుటాకుల పసిమినింపే
పండ్లసొగసుల వలచు చిలుకలు.

తల్లిచెట్టున తలపు చివురులు
కోరిమెసవే కోకిలమ్మలు

కొమ్ముదువ్వులు కూడియాడే
లేళ్ళగుంపులు కోళ్ళజంటలు
వరుగులేగల పాడియావుల

వరకరుల శోభలను దెలిపే
చిత్రములు మెచ్చినవిధమ్ముల
శబర వనితల చక్కదనములు
బిళ్ళగొప్పుల వెలుగు పువ్వుల

తేనె తెట్టెల తీరు చుట్టిన
సిగల నిండుగ మొగలిరేకులు
వరల కులికే గురుడురోజులు
సవరవీరుల చాపలాఘవ

ములను దెలిపే భుజ మహోన్నతి
తొలగు మబ్బుల వెలుగు చంద్రుని
చుట్టు చుక్కల సొంపు నింపే
కమలనాభుని కాననమ్మున

దీపలక్ష్మిని దీపపంక్తుల
దిశల తేజము లెసగ దివిటీల్
కాంతి శిఖరాగ్రముగ కొలిచే
చిత్రగాత్రుని చిదానంద

శ్రీ విశేష విచిత్ర గానధు
నీ పునీతవనీ విలాసము
కాంతి దొంతరగా మహోన్నత
ఖ్యాతి నిచ్చే కళాలక్ష్మిని

కొలుచు వేడుక తలచి తెలువగ
మాట చాలదు - పాట సాగదు
పద్య మసలే పలుక నేరదు
నవర చిత్రారిన్ నుతించగ.

*　　*　　*

# వనలక్ష్మి జాతర

కరకంకణములు ఘల్లని మ్రోగగ
గళమున తీగెల కంటెలు మెరయగ

కాటుక దిద్దిన కన్గవ మధ్యన
తీర్చిన తిలకము తీరగు మోముల
చకచ్చకిత చంచల రూపమ్ముల

మల్లెమ, గుండమ,
మాంకమ, సూరమ
దాసమ, పోతమ
మాసమ, దుగ్గమ
కన్నమ, తాడమ
కపురమ, దోరమ
గంగమ, బేతమ
కావమ, రేకమ
బాచెమ, కట్టమ
పాలవ, కుప్పమ

వెన్నమ, సోమమ, చిన్నమ, ఎరకమ
మల్లెమ లెల్లరు - ఉల్లము లలరగ

కొలచిన తల్లుల, వలచిన మల్లుల
చేతుల కోలలు చిటుక్కు చిటుక్కన

జాతర పేరున జతలు జతలుగా
అందెల రవములు సందడించగా

జడ, కొప్పులు ముచ్చటల నింపగా
అందముగా నానందము లందే

అడుగుల దర్వుల ఆటలు పాటలు
తకిట తకిట ధుంతక నాదమ్ములు

చిలుకల పలుకులు చెలువము నింపగ
కోకిల పాటల కూడిన రూపుల

పువ్వుల తావులు నవ్వుల నిండగ
మధురనాదముల మధువము లలరగ

చిత్రి చిత్కళలు చిత్రగాత్రు కుడి
ఎడమల సాగగ వడివడి మ్రోగే

తప్పెట మద్దెల తాళప్పు దర్వులు
మాధవ మందిర మంటపమున నిం

పారగ లచ్చిమి పండగ జేయగ
జయంతి జాతర శబరకాంతలే

మాధవ వనసీమను జరపగ చి
త్కళను మెచ్చుచూపులతో జనములు

సంతోషమ్మున సాగుచు చూడగ
జయజయధ్వనుల జాతర సాగెను

సర్వసవరజన సంతోషమ్ముగ
గిరివరవన సంగీతము లలరగ

* *

# వన వసంతం

మాధవ వన శబరులు మధు
మాసమున మహోత్సుకతో

వన దేవతనే గొలిచే
వన మహోత్సవమ్ము జరిపి

వనముల పోషించే ఆ
వరుణ దేవుడిని గొలుతురు.

వనము జీవన ప్రతీక
యని యడవిని భావింతురు

జీవుల జీవనము లోక
పావనమైనది తరువని ఈ

ధరణిగిరి పయోధరాల
దనిపే వనలక్ష్మిని గని
జననిగ గొలుతురు శబరులు

* * *


ముఖలింగము – జినదేవుని విగ్రహము


మధుకేశ్వరాలయ ద్వారం శిల్పము

వనజనని సరాగరమ్య
ఫలములు పూవులు చివురులు
మొలకెత్తిన భూదేవీ
మోహన లాలనతో నా
గగనమున రహించు మబ్బు
గముల పూల మొగములతో
కన్నులతో చేతులతో
వరలే గుల్మలతాదులు
పెరిగిన వృక్షాలు నిండు
దనము నిచ్చు వసంతాన
మనమలరించే సొగసుల
రాగరమానందమ్ముల
మొగ్గల సిగ్గుల నిగ్గుల
పూవుల వికసిత వదనల

మోహన రూపమ్ములతో
మోదానందమ్ములతో
పసరాకుల పవిటలతో
పసగల పిందెల, కాయల
పసిమినించు పండులతో
ఎసగే వనతరు లతికల
పొసగిన కన్నుల సొగసులు
పూవుల తావుల నింపే
పుప్పొడులందేల గాలి

పిలువని పిలుపుల దెలుపగ
మధురోహలు పెనవేసిన
మందానిలముల దేలుచు
మధుపమ్ములు పూవు లెదల
మధువుల గొలిచే కమ్మని
రాగమ్ములు నింపగ కో
లాహల మావనమున మధు
గాన ఝురులతో పూవులు
పరవశించు రసానంద
భావోదయ వసంత సం
రంభాలు సుగంధ బంధు
రమ్మై నిండిన శుభ సమ
యమ్మున చిలుకలు పలికెను
ఇమ్ముగ కోకిలలు పాడె
మయూరములు నృత్యమాడె
లేళ్ళు గంతులేసి పరుగు
లే తీయగ సాగె కోతి
మూకలు కొమ్మల నూపుచు
తోకల నాడించజూచి
రంగుల పక్షులు 'కిచకిచ'
రావమ్ముల పూవులగని
ముత్యాలకు సమముగ నా
మొగ్గల భావించుటాయె
పూచిన పూవుల చక్కని
మోములతో నెంచుటాయె

కాసారములందు పూలు
కన్నులుగా దలచుటాయె
శబరులు జంతువుల పక్షి
జాలముల మనమ్ముల గు
ర్తించి వసంతోత్సవాల
మంచి గంధములతో కుసు
మించిన మాధవ వనమున
వనదేవతనే కొలిచిరి
ఘనముగ శబరులు నా వన
మందు జీవనము సకలా
నంద ప్రదమని రాగము
లెన్నో తీసిరి పాడిరి
ఎన్నో తీరగు నాటల
పాటలతో నవ వసంత
భావామల గీతులతో
చెట్టుమట్టి పుట్టల పూ
జించే సవరాచారా
లను బాయని నీమమ్ముల
వనదేవతనే గొలిచిరి
వరుణ పూజలే సల్పిరి
పద్మనాభగిరి మాధవ
వన శోభలు విరియగా
జన జీవన మలరగా

* * *

మాధవ వన శబర మనుజాళి కలవడిన
ప్రకృతి విజ్ఞాన వైభవము శబ్దాలలో

పని పాటలుగ జనవ్యాప్తి పొందినవయ్యె
శ్రుతిగతుల గూడి పరహిత రాగ సంభృతా

నంద భావాల గోవింద నాదాల స
న్నుతి సల్పు వృక్ష సంతతి నల్లుకొన్న ల

తాతంత్రులా శబర దంపతులు కాన
నమ్మునను సరాగమోదమ్ము లుదాత్తాను

దాత్త స్వరానంద దాయకమ్ముగ సామ
గాన మకరంద శృంగార రసబంధ వా

త్సల్యమేపార మాధవ వనోత్సవము నే
త్రానంద వర్ణచిత్రమ్ముగా గ్రాలు వి

రక్షరమ్మై విస్మయము గొల్పు సత్కళా
రాశియై వెలుగు సంరంభాలు పార్వతీ

పరమేశ్వరాకార వర దివ్య తేజాల
వనము వసంత శోభాకరమ్మై వెలుగు

వనజీవ తతులు సంభ్రమడోలికల గుల్కు
శృంగార భావతరంగాల మధురస

పాన మధుపాల రసగాన నాదవినోద
ముల దూగు నుత్సాహములు దండిగా జాటు

మట్టిచొంగలు చిలుము గొట్టముల పొగలెగసి
ఎగదువ్వి తలనడుమ సిగల పువ్వుల జుట్టి

ఒప్పుకొప్పుల చెలుల మెప్పు గొప్పలబొంది
తలకట్టు బొట్టు సొంపులు బిట్టుపీక లం

దళుకొత్తు చెవుల రింగుల గూడియాడంగ
మొలకట్టు నడికట్టు పుట్టాల బిగువు లే

ర్పడ కిర్రు చెప్పు లొప్పగ సాగు శబర పురు
షుల ముఖమ్ములు శౌర్యముల జాట్లు వైరనా

నయనాలు కనుబొమలు భయము గొల్పె బాణ
ముల జాటు కుంకుమ బొట్టు దీర్చిన ముఖాం

బురుహములు చెవికమ్మ లొరసినట్టు సుగంధ
లేపనమ్ములు మేనులే నిండి గండశిల

లట్లు కదలాడు శబరాంగనా వతులు పిడి
కిట బిరిసెలే బట్టి కేరింత లిడియాడు

ఆటలందే మంచి పాటలై నవవసం
తానందవన మహోత్సాహంబు జాటగా

చిగురు రాగము దీసె
లతలు నాట్యము చేసె
ప్రకృతి పరవశమందె
పరిమళించెను పూలు.

# మధూకం

చిత్కళయు నా చిత్రగాత్రుని
చిద్విలాసుని గావరించెను
కొండ నాయకు నెడద మధురస
భాండమై ఊయలల నూగెను.

ఎల్లవేళల పూచి పూవుల
నుల్లముల నలరించు మాధవ
వనములోని మధూక వృక్షము
పటుతరంబగు రెండు శాఖలు
దక్షిణో త్తరములకు సాగి
దాని మూలము పుట్టచుట్టగ

వృక్షరాజమనంగ జగతిన
పక్షులే వనమెల్ల జాటెను
విమల మగు నా వృక్షమును తన
ప్రియ సతులు కడు మెచ్చ చూపి

చి త్తికు త్తర శాఖ నెన్నగ
చిత్కళకు దక్షిణపుశాఖను
పూలు పూయగ నేరుకొనగా
రాలునేల "ఖరారు" చేసెను

వాటి నమ్మగ వచ్చు భాగ్యము
వలన వలసిన వస్తువుల గొని
మంచిగా జీవించ భార్యలు
చేసె కట్టడి చిత్రగాత్రుడు.

దక్షిణ శాఖాభాగము
తరుణి చిత్కళ ఊడ్చియు
అలికి ముగ్గులందముగా
నలర జేసే రాలు పూల

నేరి సుమంత పురానికి
చేరి యచటగల వైశ్యుని
కమ్ముచుండె చిత్తి ఉత్త
రమ్మ శాఖ రాలు పూల.

నేరి చిత్కళమ్ముచోట
చేరి యమ్ముచుండె కాని
చిత్కళ పూలకు ధర పె
చ్చిచ్చుచుండె వైశ్యుడు య

ట్లేల నాదు పూలకు విలు
వింత తక్కువిచ్చెదవని
వాదు చేయ చిత్కళ పు
ష్పములకె ధర వలికి మిగుల

లాభము వస్తున్నట్లా
లాభి సెట్టి బదులు పలికె

అదివిని చిత్రికి కోపము
నతిశయించె నా పూవులు
అవే చెట్టుకొమ్మవనుచు
అన్నె పూవులటంచును.

పలుక చిత్రి పలుకులకా
వైశ్యుడు నేనేమి చేతు
ఆమె దెచ్చియిచ్చు పూల
కధికమైన ధర వచ్చెను

నీవు దెచ్చి అమ్మే ఆ
పూవులు ధర పల్కవాయె
చిత్రమ్మా చెప్పితి విను
ఉత్త మాటలాడ నెందు

నన్నంతన పెను తాపము
ఆననమున దోవగ గి
ద్రున దిరిగిన చిత్రి - వతిని
గని కోపముతో నతనితో

తనకు దక్షిణపు శాఖే
పనిగా నిప్పించ మనుచు
తగవుకు దిగినది వెంటనే
తరుశాఖను మార్చనెంచి

"తగవెందుకు వగపెందుకు
తరుణీ ! నీ కోరునట్లు

దక్షిణ శాఖనె గాను"మనె
తక్షణ మట్లేర్పరచెను.

చిత్కళ ఉత్తర శాఖను
చేరి యలుకు ముగ్గుల నిడి
చెట్టు మొదటి పుట్టను పూ
జించి పూలనేరుచుండె.

ఆ పూవులు స్వర్ణ శోభ
లందుచుండె వాటికి ధర
పెచ్చు పెరిగి వచ్చుచుండె
పిచ్చి కోపమెత్తి చిత్తి.

"ఎవ్వతియా చిత్కళ నా
కేలదాని తగవు దేశ
ద్రిమ్మరి నిటు దరి చేర్చితి
తీయని మాటలకు లొంగి

మాయలాడి దాని నింక
మరియాదగ విడిచిపెట్టు"
మని తీవ్రావేశముతో
పెనుగులాడె తన పతితో

ఉత్తర దక్షిణ శాఖలు
మొత్తము నావే, ఆ చె
ట్టే మొత్తము తనదని
ఢీకొనె పతితో తగవుకు.

మాధవ వనశోభను మధు
సూదనుడై పోషించే
చిత్రగాత్రు మనమున నా
చెట్టు నరకుచెట్లని సం
దేహించును వనరక్షణ
ధ్యేయము తన జీవన ల
క్ష్యమ్మై యున్నది కద యే
గతి నరసిన చెట్టును నర
కగ మనమొప్పని చిం
తాగతికమ్మై దలంచె
నీగతి నా చిత్రగాత్రు
డాకానస మధూకమ్ము
అత్యున్నతమై ద్విజాలి
కావాస మొసంగి మిగుల
పూలనీడలను నొసంగి
ఘన జీవనమును సాధిం
చిన దెన్నోవసంతాల
గని తానై బతికిన దా
నిని నేగతి తెగటార్తును
సవతుల పోరునగద ఈ
చక్కని చెట్టును నరికే
పని చెడుకాదాయని మన
మున తపించును 'తప్పను'
ఇల్లాంద్రకు మధ్య కలహ

మేగతి చల్లారదాయె
ఈశ్వరేచ్ఛ ఎట్లున్నదొ
ఎరుగను నేనే తీరున
కలహ కారణము చెట్టీ
గతి కూలగ వలయునా
ఎత్తిన గొడ్డలి దించక
తుత్తునియలు జేతునా
ఇనుమును గూర్చిన పీడను
ఇంగలమ్మొగొను గాదా
సవతుల జగడము దీర్చగ
సంహరింతునా చెట్టును
పరిపరి విధముల చింతా
పరితప్తుండగుచు చిత్ర
గాత్రుడు విధినియతి చేసి

చిత్రగాత్రు మదికి గొప్ప
చింత కలుగజేసె తగవు
తగవుగూడె మెల్ల చిత్తి
తానే తందాన చేసె.

తగవుకు మూలము చెట్టని
తనలో తర్కించి గండ్ర
గొడ్డలి చేబూని తీవ్ర
కోపావేశముతో నా

*　　*　　*

# ప్రహారం

వృక్షమూలమును నరికెను
తక్షణమే విరిగె చెట్టు
ఫెళఫెళమను చప్పుడుతో
తళతళమను మెరుపులతో

వృక్షకోటరమ్ము నుండి
వింత కాంతి ధగధగమని
కోటి సూర్య ప్రభా భాస
మౌట చిత్రగాత్రుడంత

చూడలేక మూర్ఛనొందె
తోడ చిత్తి భయము చెందె
గూడేనికి కూతపెట్టె
వాడలెల్ల కదలిరాగ.

చిత్కళ చిన్ముద్ర దాల్చె
శివనామము మదిదలంచి
"శివాయ విష్ణురూపాయ
శివాయ బ్రహ్మణేనమః"

అని మనమున చిత్కళ వం
దన మొనరించిన యంతన

వృక్షమూలమందె శివుడు
సాక్షాత్కారమ్మయ్యెను

చిత్కళ ప్రార్థనము మెచ్చె
శివుడు పార్వతీయుతుడై
చెట్టుమొదట ప్రమదాదుల
చేపరివేష్టితుడయ్యెను

దారువు మూలమున నుండి
ధగధగమెరిసే కాంతుల
ప్రత్యక్షంబైన శివుడు
ప్రసన్నుడై శబరుల గని

"మీరు పూర్వ జన్మంబున
పేరుగన్న గంధర్వులు
వామదేవ మహర్షి శా
పమున శబరులైతిరి ఈ
నాటితో విముక్తి జరిగె
నా దర్శన భాగ్యమునన్"

అంతలోన చిత్రగాత్రు
డా శివుని అనుగ్రహాన
మూర్ఛదేరి "దేవ! దేవ!!
దిక్కు నీవె మహా ప్రభూ!

జగదాధారుడవు నీవు
దీన బాంధవుడవు నీవు
దయా సాగరుడవు నీవు
ధీ వరమేశ్వరుడవు నా
గాన ఝరీశ్వరుడవు నా
తంౘ్రీ దయజూడ" మనుచు
తనలో తాదాత్మ్యండై
ప్రార్థన మొనరించెనంత

*　　　*　　　*

## విముక్తి

గంధర్వ ప్రభు రూపము
గాంచె చిత్రగాత్రుడంత
"గణాధిపా! గంగాధర!
కళానిధీ! కరుణాకర!
కామదహన! కాలకంఠ!
కలుషహరా! కరుణాంబుధి!"
యని గాన ప్రబల వినుతి
నొనరించెను లయ గతికల
వంశధార తరంగాల
పడగెత్తే పాటలతో
పరమ శివుని ప్రార్థించగ
ముఖ లింగ ప్రభ మెరయగ
అఖిల భువన రక్షకుడై
పద్మనాభగిరి శిఖరిని
వరలిన వృషవాహనుండు
చిత్రగాత్రుగాంచి యిట్లు
చెవుల విందుగా బలికెన్.

"చిత్తి నీకు చిత్తమయ్యె
చిత్కళ జ్ఞానంబయ్యెను

ఇర్వురు రవి శశికళలై
ఈ నా కన్నుల వెలిగెద"
రన్నంతనె చిత్కళ హా
రతియై తనలోన జేరె
చిత్తి జటావాటిలోని
శివగంగతరంగమయ్యె

*  *  *

బ్రహ్మాది దేవతలు
పశుపతిని నుతియించి
పుష్ప వృష్టి యొనర్చి
పూజించి రందరా
మోహనాకృత శివుని
ముఖ లింగమూర్తిగా

అమల మధూకేశ్వ
రాకారునిగ సదా

అవర కాశీక్షేత్ర
మనువాసి పొందగా
కలుష హారిణి గంగ
గా వంశధారగా

పద్మనాభాన్విత
పర్వత మనగా
మాధవ వనముగా
మహివాసిగొనగా



మధునే [illegible] దవమందున్న శివలింగ[illegible]ము విగ్రహము



మధుకేశ్వరాలయ ఆవరణములోనున్న శివాలయము



మధుకేశ్వరాలయ కుడ్య శిల్పము – నదీ దేవత



మధుకేశ్వరాలయ కుడ్యముపైనున్న విమానము – శిల్పము

ఉత్తర దక్షిణోన్మేలన మనగా
నాద బిందువుకళా మోదైక మనగా
షోడశ తీర్థ విశుద్ధ క్షేత్రముగా
విశ్వ మానవులు సేవించి తరించగా

వెలుగనీ కాంతారమూ ! ముఖలింగ
మలరగా సుక్షేత్రమూ!

బ్రహ్మ కోరిక లోకవక్షమై ఫలియించ
వనకళాలక్ష్మియై వరలె శారదయు
వనిని మధూకేశ్వరునిగ శివుడుండ
వరవీరలక్ష్మియై బరగె పార్వతియు
మాధవ వనసీమ మనుటచే విష్ణు
వనపు సౌభాగ్యమై వరలెనా లక్ష్మి
ముమ్మూర్తులానందమున సతుల గూడి
వనము పావనముగా వసియించి రొకట

ప్రేమ ఒక్కటె లోకప్రియమైనదగుట
అమరేంద్రుడా గిరియందె వసించె
సర్వజన సామరస్యమునకు నెలవై

ముఖలింగమొప్పె నద్భుతమాంధ్ర ధాత్రి
కోటిలింగ స్థాపకుడుగ నా బ్రహ్మ
పూజార్హతలను సమ్మోదమున బొందె
కాశికి సమమైన ఘన నగర మొకటి
ఒనరించె బ్రహ్మాజ్ఞగొని విశ్వకర్మ

స్వర్ణదేవళ మచట ప్రభవింపచేసి
"మధుకేశ్వరము" పేర మాన్యమొనర్చె
అతి పవిత్రంబైనదై నుతులందగా
సర్వతీర్థము లిచట సంస్తుతులందె
తీర్థమాహాత్మ్యల తెలిసి దెల్పుటకు
ఎవరితరంబుగా దెరిగింపననుచు
షణ్ముఖు డగస్త్యునకు శక్తిమేరకు దెల్పె
శోడషతీర్థప్రస్తుతి చేసినిట్లు.

* * *

## షోడశ తీర్థ విశేషాలు

జంబూ జలమ్ముల స్నానమాడిన కలుగు
వాజిపేయము జేయ వచ్చెడి ఫలమ్ము.

2

కోటి తీర్థములోన కోరి జలకంబాడ
బహు రోగ పీడనలు - పరిహారమగును.

3

సోమతీర్థాన విశుద్ధమతిని మున్గ
ఘోర పాపములు పరిహారమైపోవు.

4

సూర్యతీర్థ స్నాన శుద్ధతచే బహు
రోగ బాధలు బాసి బాగ బతికేరు

5

కౌబేర తీర్థాన ఘనమతి మునిగితే
కోరు కోర్కెలును ఈడేరు వెనువెంట

6

మంకణ జలముల క్రుంకులిడంజాల
పరమ శివు కైలాస పదము జిక్కును.

7

మునగ పిశాచమోక్షణ తీర్థమందు
ప్రేతభూతభయాలు విడిచిపోయేను

8

పక్షితీర్థానసే పగిది స్నానంబాడ
పరిశుద్ధుడై దుఃఖపరిహారుడౌను

9

పద్మసరస్తీర్థ భాగాన మునగ
మృత్యుభయపీడ నివృత్తియగు వేగ

10

పద్మ సంజీవ జీవన మందు జలక
మాడిన సుఖ జీవనానంద మొదవు.

11

మల విమోచన తీర్థ జలకమ్ములాడ
గంగ జలమున మున్గ కలుగు ఫలమబ్బు.

12

పుష్కర తీర్థాన మునుగు వారలకు
సఖ్యత లన్నింట సమకూరుచుండు.

13

బిందు తీర్థపు కాంతి బిందువులదాక
పాపపంకంబెల్ల ప్రక్షాళన మవు

14

హంస తీర్థాన మహానంద మతితో
స్నానమాడిన కలుగు సకల స్వచ్ఛతలు

15

గయ తీర్థ జలకాల నయమెంచి సల్ప
భవ్య జీవన భోగభాగ్యాలు గలుగు

16

చక్ర తీర్థాన కడు స్నానాలు సల్ప
సకలార్థ సిద్ధులై జగతి జీవింత్రు.

* * *

శివుని నెన్నుదుటనే చిచ్చుతో నిండి
చిన్ముద్రలోచనము క్షేమకరమై యుండె
ఆలోచనమునందె అఖిల సృష్టియు జరిగె
ఆలోచనము నందె అభివృద్ధియై సాగె
ఆలోచనము నందె అంతమొందుట నాయె
అఖిల మాలోచనంబందు పొడముట లాయె
జడచేతనములు విశ్వస్వరూపము దాల్చె
జీవ నిర్జీవ సంరావ విరావాల
మానవులు శిష్టులై మనిరి భూమిని సదా
పదముతో పాటతో పద్య రాగాలతో
ఆటతో శిల్ప సౌందర్యాక్షరాలతో
రాగమాధుర్యాలు త్యాగసంరంభాలు
పరిమళానందాలు భావసంవేద్యాలు
ఆలోచనాత్మకానంద రూపమ్ములై
పూవులై తావులై మోదాలునింపగా
రాగమే విశ్వహర్మ్యమ్ముగా నిల్వగా

శివుడు శరత్కాంతి
చిద్రూపుడై యాడ
వరలెపార్వతి ప్రాణ
వట్టమైలాస్యాన
పరమ పావన రూపభావాల నానంద
పారవశ్యాల విశ్వంభరాకారుడై
సానంద గుణరస స్వాంతుడై వెలయుశా
పద్మగిరి వనక్షేత్రపాలకుండయి విష్ణు
ఆమధూకేశ్వరుని యానందమునుగాంచ
ముఖలింగమలరె నద్భుత కాంతిపుంజమై

* * *

అద్వైత విశిష్టాద్వైతమ్ముల
నాంధ్ర భారతావనికి కేంద్రమై
శశ్వదానంద సంశోభితమై
విశ్వకల్యాణ విమలతేజమై
వరలనీ గేయకథ
ప్రార్థింతు తుదిన్
మదిని విశ్వాసమున
స్మరియింతు శివున్.

—: o :—

